సంపాదకీయం.......

# దేశం ఎటు పోతే ఏమి? నేను బాగుపడితే చాలు!

ప్రాచీన కాలమునుండి మన దేశ చరిత్రను పరిశీలిస్తే, మనదేశంలో శక్తి సంపన్నులైన రాజాధిరాజులు లేకపోవడం వలన మనం ఓడిపోలేదనే యదార్థం స్పష్టమవుతున్నది. అయితే ఆనాటి రాజుల మధ్య సమిష్టి సమైక్యతాభావం లోపించడం వలననూ, సమాజ దృక్పథం లేకపోవడం వలననూ, మనవారి మధ్యనే ఈర్ష్యా ద్వేషములు పెచ్చు పెరిగి పోవటం వలననూ, మన దేశం విదేశీయుల చేత కొల్లగొట్టబడింది. ప్రాంతీయ దురభిమానం, కులతత్వం, వర్గ వైషమ్యాలు విజృంభించడం వలననే మన జాతి బలహీనమైంది. అన్నిటి కన్నా ముఖ్యం "**జయచంద్రుడు**" లాంటి దేశద్రోహులు అడుగడుగునా ఉండటం వలన విదేశీయులు తమ విష కబంధ హస్తములను మన దేశం మీద చాపగలిగారు. మనలో నున్న ఈ బలహీనతలను విదేశీయులు చక్కగా ఉపయోగించుకొని, తమ సామ్రాజ్యములను మన దేశంలో నెలకొల్పగలిగారు.

అదే పరిస్థితిని ఈనాడు కూడా మనం ఎదుర్కొంటున్నాం. దేశద్రోహులు తమ కార్యకలాపాలను మన దేశంలో అతి తేలికగా విస్తరించుకుంటున్నాయి. అనేక అకృత్యాలకు పాల్పడుతున్నారు. కొందరు విధ్వంసాలు సృష్టిస్తున్నారు. మరికొందరు మారణ హోమాలకు పాల్పడుతున్నారు. మన సైనిక రహస్యాలను సేకరించి విదేశాలకు అందిస్తున్నారు. మనలోనున్న కొందరు స్వార్థపరుల సహకారంతో, విదేశీయులు కొందరు మనదేశంలో రహస్య స్థానములను ఏర్పర్చుకొని, మన దేశమును సర్వనాశనం చేయడానికి సర్వ ప్రయత్నములూ, కుట్రలు చేస్తున్నారు. కొందరు ఆ విధంగా చేస్తుంటే, మరికొందరు మన దేశ ఆర్థిక వ్యవస్థను కొల్లగొట్టే ప్రయత్నం చేస్తున్నారు. అవినీతి వికటాట్టహాసం చేస్తున్నది. అక్రమ మార్గాల ద్వారా, అతి తేలిక పద్ధతుల ద్వారా, ధనమును సంపాదించి, భోగభాగ్యములను అనుభవించాలనే కోరిక నానాటికి ప్రబలుతున్నది. ఎవరిస్థాయిలో వారు చేతికి అందినదంతా అక్రమ, అనాచార పద్ధతుల ద్వారా వేలకోట్ల రూపాయలు దోచుకుంటున్నారు, విదేశాలలో దాచుకుంటున్నారు. ఈ "రేస్"లో రాజకీయనాయకులు కూడా ఏ మాత్రం వెనుకబడలేదు. ఎవరు ఎన్ని దురాగతాలు చేసినా, ఎన్ని అక్రమ, అనాచార మార్గములను అనుసరించి కోట్లు సంపాదించినా కేసులు కోర్టులలో నిరూపణ కావటం లేదు. నిర్దోషులుగా విడిచి పెట్టబడుతున్నారు. కనుక ఎంతటి దురాగతాలకైనా ఏమాత్రం వెరువడం లేదు. ఇది ఈనాటి మన దేశ దుస్థితి.

ఈ విధంగా మన దేశంలో అవినీతిపరులు, లంచగొండులు, దేశద్రోహులు అతి తేలికగా విడిచి పెట్టబడుతుంటే, "**లంచం తీసుకున్నందులకు చైనాలో ఉరివేశారు**" అనే వార్త వింటే ఆశ్చర్యము వేస్తుంది. చైనాలోని యుతోనాసిటీ మాజీ వైస్ మేయర్ '**లాటెంగ్ లాంగ్**' తన పదవీ కాలంలో 18 సార్లు లంచం తీసుకున్నట్లుగా రుజువు కావటం వలన, అతనికి మరణ శిక్ష విధించబడిందట. అతను కొంతకాలం పాటు కమ్యూనిష్టు పార్టీ నగరశాఖ అధ్యక్షుడుగా కూడా పనిచేశాడుట. మరో అత్యున్నత స్థాయి పోలీస్ అధికారికి అవినీతి ఆరోపణలపై జైలు శిక్షపడిందట. మరో సంఘటనను పరిశీలిస్తే అత్యంత ఆశ్చర్యం వేస్తుంది. కొంతకాలం క్రిందట ఒక ప్రముఖ భారతీయ వాణిజ్యవేత్త, చైనాకు అతను పంపిన పొగాకు బేళ్లలో రాళ్ళు పెట్టినట్లుగా కనుగొన్నారు. ఆ అవినీతిపై విచారణ జరిపి, దానికి చైనాలో బాధ్యులైన వారికి మరణశిక్ష పడగా, మన దేశంలోని ఆ ప్రముఖ వాణిజ్యవేత్త మాత్రం తప్పించుకుని, మరింతగా ఎదిగాడు, పెద్దనాయకుడైనాడు. మన దేశంలో ఎంత పెద్ద నేరం చేసినా తేలికగా తప్పించుకునే అవకాశాలు ఉన్నాయి. సాక్ష్యాధారాలు అంత సులభంగా దొరకవు. కేసు నత్తనడక నడుస్తుంటుంది. వాయిదాలు పైన వాయిదాలు పడుతుంటాయి. ఈ లోపు జనం మరచిపోతారు. కేసు '**గప్‌చిప్**' కాకుండా కొట్టివేయబడుతుంది. మర్డర్లు, లూటీలు, దహనకాండలు చేసికూడా తప్పించుకోవటానికి చాలా మార్గాలున్నాయి. ఎన్ని అవినీతి పనులు చేస్తే అంత పెద్దవాడవుతాడు. ఎన్ని మర్డర్లు చేస్తే అంత పెద్ద

(తరువాయి 3వ కవర్ పేజీలో)

మే 2000

సంపుటి 16 సంచిక 5

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా | | |
| (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**8-05-2000**

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



సినీవినీలాకాశంలో ధృవతార
**పృథ్వీరాజ్ కపూర్**

# సుభాషితవాణి

"మత్పిండ మేకో బహుభాండరూపం
సువర్ణ మేకం బహుభూషణాని
గోక్షీర మేకం బహుధేనుజాతం
ఏకః పరాత్మా బహుదేహవర్తీ."

అనగా కుండలు వేరైనా వాటిలో వున్న మన్ను ఒక్కటే. సొమ్ములు వేరైనా వాటిలో ఉన్న సువర్ణం ఒక్కటే. ఆవులు వేర్వేరుగా ఉన్నా అవి ఇచ్చేపాలు ఒక్కటే. అలాగే శరీరాలు వేర్వేరుగా ఉన్నా వాటిల్లో ఉన్న పరమాత్మ ఒక్కడే.

భారతీయ సంస్కృతి భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రబోధిస్తున్నది. భిన్నమైన రూపములందు ఏకత్వమును ప్రకటించటం దాని ప్రత్యేకత. సర్వజనహితమే భారతీయుల మతం. సర్వజనహితమే భారతీయ సంస్కృతి.

సర్వాత్మ దృష్టిని అలవరుచుకోవాలని, ఏకాత్మ భావనను అభివృద్ధి పరచుకోవాలని, భారతీయ సంస్కృతి బోధిస్తున్నది. అన్ని ప్రాణులలోను వున్న ఆత్మ ఒక్కటే అనే ఏకాత్మభావం పెట్టుకొనినప్పుడు, ఎవరిని బాధపెట్టినా నిన్ను నీవు బాధపెట్టుకున్నవాడవవుతావు. అన్ని జీవులలో పరమాత్మ వున్నాడనే విశ్వాసాన్ని కలిగి ఉన్నప్పుడు ఏ జీవిని హింసించినా, తిరస్కరించిన పరమాత్మనే హింసించినట్లు, తిరస్కరించినట్లు భావించినట్లే అటువంటి అకృత్యాలకు ఎవరూ పాల్పడరు.

"సర్వజీవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" (ఏ జీవికి నమస్కరించినా కేశవునికే వర్తిస్తుంది) "సర్వజీవతిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" (ఏ జీవిని తిరస్కరించినా కేశవునికే వర్తిస్తుంది) - ఇటువంటి అత్యున్నతమైన తత్త్వజ్ఞానం ప్రపంచంలో మరెక్కడా కనిపించదు. ఇదే భారతీయ సంస్కృతి వైశిష్ట్యము.

"మతములన్నియు వేరు, మార్గమొక్కటె
వస్త్రభేదములు వేరు, వస్తువొక్కటె
శృంగారములు వేరు, బంగారమొక్కటె
పశువులవన్నెలు వేరు, పాలు ఒక్కటె
జీవజాతులు వేరు, జీవుండు ఒక్కటె
జాతినీతులు వేరు, జన్మంబు ఒక్కటె
దర్శనంబులు వేరు, దైవంబు ఒక్కటె
పూల జాతులు వేరు, పూజ ఒక్కటె
తెలియలేకను మానవుల్ తెలివి తప్పి
బ్రతుకు కోసము బహుబాధ బద్ధులైరి"

అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. కులం పేరుతో కుమ్ములాడుకుంటున్న ఈ రోజులలో మతం పేరిట మారణహోమాలు చెలరేగుతున్న ఈ దుర్దినాలలో బాబా సందేశం ఆలకించి, అవగాహన చేసుకొని, ఆచరిస్తే నిజంగా జాతీయ సమైక్యతను సాధించిన వారమవుతాం. జాతులు, దేశాల మధ్య శాంతియుత వాతావరణాన్ని నెల కొల్పినవారమవుతాం. విశ్వశాంతికి దోహదం చేసిన వారమవుతాం.

**- భరద్వాజ్**

ఓం సాయి చరణము దొరికెను నేడే
ధన్యుడవైతివి ఓ నరుడా
వానర చేష్టలు వెంటనె వీడి
సద్గతి బడయుము మానవుడా

పరమాత్ముని కనుగొను మార్గము దొరికెను
మాన్యుడవైతివి మానవుడా
మాధవతత్త్వము గ్రహించి నీవు
గమ్యము చేరుము పామరుడా

సాయి చరణము దొరికెను నేడే
ధన్యుడవైతివి ఓ నరుడా
శ్రీసాయి చరణము దొరికెను నేడే
మాన్యుడవైతివి మాధవుడా

"తారక మంత్రము కోరిన దొరికెను నేడే ధన్యుడ నైతివిరోరన్నా (వరస) (రాగం ధన్యాసి)" (బహుళ ఏకతాళం)

**- కె.వి.జె. మూర్తి, కోరాపుట్**

# సినీ వినీలాకాశపు ధృవతార పృథ్వీరాజ్ కపూర్

ముంబాయిలోని ఆర్.కె. స్టూడియోలో ఒక చలన చిత్ర నిర్మాణ ప్రారంభోత్సవము జరుగబోతోంది. నటీ నటులు మేకప్ మేన్‌లు, టెక్నీషియన్లు, కెమేరామేన్‌లు, అందరి హృదయాలలో ఉద్విగ్నత, భయం తాండవమాడు తున్నాయి. ముహూర్త సమయం సమీపిస్తుంది. ఇంతలో ఆ స్టూడియోలో ప్రవేశించారు ఒకాయన. ఆరడుగుల ఆజానుబాహువు, స్ఫురద్రూపి, చూపరులను ఇట్టే ఆకర్షించే ముఖవర్చస్సు, భయం గొలిపే చురుకైన చూపులు కలిగిన ఆయన స్టూడియోలోకి వచ్చారు. సిబ్బంది అందరిలో కలకలం చెలరేగింది. ఆ వచ్చిన వ్యక్తి అందరికీ వినయ పూర్వకంగా అభివాదములు చేస్తూ కొందరిని ఆత్మీయంగా పలుకరిస్తూ మరికొందరితో కరచాలనం చేస్తూ, కొందరిని ఆశీర్వదిస్తూ ముందుకు సాగారు. ముహూర్తం ప్రారంభం అయ్యింది. ఆ వ్యక్తి సాంకేతిక సిబ్బంది నుదుట తిలక ధారణ చేసి వారిచేత తీపి తినిపించి చేతులలో కొన్ని రూపాయి నాణెములు ఉంచి అందరికి పాదాభివందనం చేశారు. ఈ సంఘటనతో అక్కడ ప్రతివారి హృదయాలు పులకరించిపోయాయి. మాటలురాక చేష్టలుడిగి మూగవారై పోయారు. ఆ పెద్దాయనపట్ల వారి హృదయంలో ప్రేమతో పాటు కృతజ్ఞతా భావం కూడా తొంగి చూసింది. ఇంతకీ ఆయన ఎవరనుకుంటున్నారు? ప్రఖ్యాత నాటక, చలన చిత్ర నిర్మాత, దర్శకుడు మరియు ఆర్.కె. స్టూడియో అధినేత శ్రీ పృథ్వీరాజ్‌కపూర్. సినిమా సెట్స్‌పై పని చేయ డానికి వచ్చినప్పుడు చిన్నా, పెద్దా అనే తారతమ్యం లేదు. అందరూ పనివారమే అని చెప్పే పృథ్వీరాజ్ ఆదర్శ స్ఫూర్తికి అద్దం పడుతుంది ఈ సన్నివేశం.

మరొక హృద్యమైన హృదయాన్ని తాకే సన్నివేశం ఏమిటంటే ముంబాయిలోని రాయల్ ఒపేరా థియేటర్‌లో అప్పట్లో నాటకాలు మాత్రమే ప్రదర్శితమవుతుండేవి. పృథ్వీరాజ్ తన అసమాన నటనా చాతుర్యంతో ప్రేక్షకులను మూడు గంటల పాటు మంత్రముగ్ధులను చేసేవారు. ఆ ఆశ్చర్యం, ఆనందం ఆహ్లాదాలనుండి ప్రేక్షకులు తేరు కుంటూ వెళ్లిపోయేలోపల పృథ్వీరాజ్ తన మామూలు దుస్తులతో గేటు వద్ద నిలబడి చేతిలో ఒక టోపీలాంటిది పట్టుకుని నాటకం చూసి వెళ్లిపోతున్నవారి దగ్గర నుండి మంచి కార్యాల కొరకు చందాలు సేకరించేవాడు. అప్పటి వరకు తమ హృదయాలను దోచుకున్న తమ అభిమాన నాయకుడు ఎటువంటి అతిశయం ప్రదర్శించకుండా గేటు వద్ద బిక్షగాడివలె నిలచి చందాలు స్వీకరించడం చూసిన

**కొమరగిరి మాధవిశ్యామ్**

ప్రేక్షకులు అవాక్కయ్యేవారు. వారి హృదయంలో ఆయన పట్ల ఆరాధన అధికమయ్యేది. కరువు బాధితుల సహాయార్థ మనో, విధవల పునరావాస నిమిత్తం అనో ఏదో ఒక మంచి కార్యం నిమిత్తమే ఆయన చందాలు స్వీకరించేవారు. కళ అనేది ప్రజల చేతనే పోషించబడాలి. ప్రజల కొరకు ఉపయోగపడాలి అనేది పృథ్వీరాజ్ సిద్ధాంతం. తను నమ్మిన సిద్ధాంతాన్ని ఆచరించడానికి ఆయన జీవిత పర్యంతం శ్రమించారు. నాటక చలనచిత్ర రంగాలకు ఎనలేని సేవ చేసి కళామతల్లి ముద్దు బిడ్డడు అయ్యారు.

1906 నవంబరులో పేషావర్‌లోని ఒక ఉన్నత పఠాను కుటుంబంలో దివాన్ బషేషార్‌నాథ్, వైష్ణోదేవి దంపతుల ప్రథమ సంతానంగా శ్రీ పృథ్విరాజ్ జన్మించారు. చిన్నప్పటి నుండి పృథ్వీనాథ్‌కు (చిన్నప్పటి పేరు) నాటకాలు అంటే అపరిమితమైన ఇష్టం. తన ఇంటికి వచ్చే అతిథులను అభ్యాగతులను, సాధుసత్పురుషులను వారిచర్యలను, మాటలను గమనిస్తూ ఉండేవాడు. ఉన్నత కుటుంబానికి చెందినవాడైనా చిన్నప్పటి నుండి మంచి పెంపకములో పెరిగిన వాడవటం వలన ఎంతో నియమబద్ధమైన జీవితం గడపటానికి అలవాటు పడ్డాడు పృథ్వీరాజ్. చిన్నప్పుడు ఒక పర్యాయం నాటకంలో లక్ష్మణుడి పాత్ర వేసి తన మొదటి పారితోషికంగా ఒక రూపాయిని బహుమతిగా పొందారు. ఎనిమిదేళ్ళ వయసప్పుడు హరిశ్చంద్ర నాటకానికి

దర్శకత్వం వహించి ఊరిలోని వారందరి ప్రశంసలనందు కున్నారు. అయితే చదువులో కూడా పృధ్వీరాజ్ ఎప్పుడూ మొదటి స్థానంలోనే ఉండేవారు. మెట్రిక్యులేషన్‌లో ప్రథమ స్థానంలో ఉత్తీర్ణులయ్యారు. విద్యాభ్యాసం నడుస్తుండగానే, 17 ఏళ్ళ వయస్సులో ఆయనకు 15 ఏళ్ళ రమాసరానితో వివాహం జరిగింది. బి.ఏ. డిగ్రీ తీసుకొనక ముందే ఆయన తండ్రి అయ్యారు. వారి ప్రథమ పుత్రుడే శ్రీ రాజ్‌కపూర్. కాలేజిలో పృధ్వీరాజ్ షేక్స్‌పియర్ నాటకాలను ప్రదర్శిస్తూ, అందరి చేత ప్రశంసలనందుకుంటుండే వారు. ఎన్నో ఆడవేషాలు కూడా వేస్తూ మెప్పిస్తుండేవారు. బి.ఏ. డిగ్రీ తీసుకున్న తర్వాత తండ్రి కోరిక ప్రకారం లా చదివారు. అయితే ఆ పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేదు. ఆయన ధ్యాస అంతా నటన మీదే ఉండేది.

భారతదేశానికి సినిమా ప్రపంచం పరిచయమవుతున్న రోజులవి, మూకీ సినిమాల ప్రవేశం అప్పుడే జరిగింది. లాహోర్ గొప్ప సాంస్కృతిక కేంద్రంగా భాసిల్లుతుండేది.

## ఎలాంటి వాళ్ళు వీళ్ళు

వెతుకుచునే వాళ్ళా వీళ్ళు
వెదజల్లే వాళ్ళా
వెలుగులు లాగేవాళ్ళా వీళ్ళు
వెలుగు నిచ్చే వాళ్ళా
తనకే కావాలనే వాళ్ళా వీళ్ళు
తనను తగ్గించుకునే వాళ్ళా
తెలియజెప్పని మిధ్యాల వాళ్ళా వీళ్ళు
తేటతెల్లంపు వాళ్ళా
పిడికిలి బిగించేవాళ్ళా వీళ్ళు
పిడికెడు జార్చే వాళ్ళా
పీల్చి పీడించే వాళ్ళా వీళ్ళు
పేదల జాలిగజూచే వాళ్ళా
అంతా నాదనే వాళ్ళా వీళ్ళు
అంతా నీదే అనే వాళ్ళా
అలక్ష్యం చేసే వాళ్ళా వీళ్ళు
అనంతుని కొలిచే వాళ్ళా

**రాపర్ల జనార్దనరావు**, మచిలీపట్నం.

రు. 200/-లు లోను తీసుకొని భవిష్యత్తును వెదుక్కొంటూ పృధ్వీ లాహోర్‌కు పయనమయ్యారు. అయితే ఆయన కలలు ఏవీ యదార్థరూపం దాల్చలేదు. నిరాశతో ఆయన వెను తిరగవలసి వచ్చింది. తర్వాత రెండేళ్ళపాటు ఆయన అవకాశాలను అన్వేషిస్తూ ఉండిపోయారు. అప్పుడు ఒక డ్రామా కంపెనీ వారు నిర్వహించిన ఒక ఉర్దూ నాటకాన్ని ఆయన చూడడం జరిగింది. నాటకంలో నటీనటుల కృతకమైన హావభావాలు, సన్నివేశ చిత్రీకరణలు ఆయనను ఆలోచింపచేసాయి. ఏదో ఒకరోజున చక్కని కళాకారుల నందరిని ఒకచోట చేర్చి మంచి డ్రామా కంపెనీని ఏర్పాటు చేయాలని నిశ్చయించుకున్నారు. అటు తర్వాత ముంబాయి వెళ్ళి అక్కడ అవకాశాల కోసం స్టూడియోల చుట్టు ప్రదక్షిణ చేయడం ప్రారంభించారు.

1929 అక్టోబరు 2 పృధ్వీరాజ్ జీవితంలో చాలా సుదినం ఇంపీరియల్ కంపెనీ అధినేత ప్రఖ్యాత దర్శక నిర్మాత ఇరానీ నామమాత్రపు భత్యంపై మూడు సినిమా లలో చిన్ని చిన్న వేషాలకు అవకాశం ఇచ్చారు. పృధ్వీ ఆనందానికి హద్దుల్లేవు. అంతలో ప్రఖ్యాత దర్శక నిర్మాత శ్రీ డి.పి. మిశ్రా కంటిలో పడ్డారు పృధ్వీ. అంతే ఆయన తన తర్వాతి (మూకీ) సినిమాలలో హీరోగా నటించమని అడిగారు. నెలకు 70 రూపాయలుగా వేతనం ఏర్పాటు చేయబడింది. ఆవిధంగా పృధ్వీరాజ్‌ను కథానాయకుడ్ని చేసి ప్రేక్షకుల ముందు నిలబెట్టిన మొదటి చిత్రం "సినిమా అమ్మాయి." (The Cinema Girl)

1931లో పృధ్వీరాజ్‌లోని నటనా సామర్ధ్యాన్ని గమనించిన శ్రీఇరానీ భారతదేశంలో మొట్టమొదటి టాకీ సినిమా అయిన 'ఆలం అరా'లో నటించడానికి అవకాశం ఇచ్చారు. ఇందుకు గాను నెలకు రెండు వందల రూపాయల కాంట్రాక్టుపై పృధ్వీరాజ్ సంతకం చేసారు. అప్పుడు ఇక పృధ్వీ కుటుంబం అంతా బొంబాయికి చేరింది.

సినిమా రంగంలో తనకంటూ ఒక విశేష స్థానాన్ని సంపాదించుకుంటున్నా పృధ్వీరాజ్‌కు నాటకాల మీద వున్న మక్కువ ఏ మాత్రం తగ్గలేదు. గ్రాంట్ ఆండర్‌సన్ థియేట్రికల్ కంపెనీలో చేరి ఆయన ఎన్నో నాటకాలు పట్టణాలు, పల్లెల్లో ప్రదర్శించసాగారు. షేక్స్‌పియర్ నాటకాలు, శూద్రకుడి 'మృచ్ఛకటిక' ఆధారంగా నిర్మించిన 'ద టాయ్ కార్ట్' వంటి 14 నాటకాలలో ఆయన ముఖ్య

భూమికలను విజయవంతంగా పోషించారు, అయితే నాటక రంగానికి తగ్గుతున్న ఆదరణకు నిదర్శనంగా ఆ కంపెనీను మూసివేయడం జరిగింది.

కలకత్తా నగరం కళలకు కాణాచి వంటిది అంటారు కాబట్టి తన సామర్థ్యానికి తగ్గ గుర్తింపు దొరకవచ్చుననే ఉద్దేశ్యంతో పృధ్వీ కలకత్తా చేరారు. దేవకీ బోస్ 'ఇండియన్ ఫిల్మ్స్ కంపెనీ' లో చేరి ఎన్నో సినిమాలలో ముఖ్యపాత్రలు పోషించారు ఆయన. 'సీత' అనే నాటకంలో రాముని పాత్ర లో ఆయన నటన 'నభూతోనభవిష్యతి'. కలకత్తాలో ఎందరో ప్రముఖులతో కల్సి ఎన్నెన్నో మంచి సినిమాలలో నటించారు. 'రాజారాణీ మీరా, విద్యాపతి, జీవన్‌నాటక్, దుష్మన్, ప్రెసిడెంట్, మంజిల్ సపేరా, డాకూ మంజూర్, మిలాప్, అనంత్ ఆశ్రమ్, అభాగిన్', అప్పట్లో ఆయన నటించిన మంచి సినిమాలలో కొన్ని మాత్రమే.

శ్రీ పృధ్వీరాజ్ 1939లో బొంబాయి తిరిగి వచ్చి ఒకే సంవత్సరంలో 'పాగల్, ఆజ్‌కా హిందుస్థాన్, అధూరీ కహానీ, సజనీ, చింగారే', అనే నాలుగు సినిమాలలో నటించారు. అవి ఆయనకు ఎంతో పేరును తెచ్చిపెట్టాయి. చలనచిత్ర రంగంలో ఇక ఆయన వెనుతిరిగి చూసుకోలేదు. స్వతంత్ర నటుడిగా స్థిరపడ్డారు. ఎంతో ధనం, కీర్తి సంపాదించారు. నటనే తన వూపిరిగా భావిస్తూ సినిమాలతో పాటు ఎన్నో నాటకాలు, స్టేజి ప్రదర్శనలలో పాల్గొన్నారు.

శ్రీపృధ్వీరాజ్‌కు చలనచిత్రరంగం కంటే నాటకం రంగం మీద మక్కువ ఎక్కువ అని చెప్పవచ్చు. నాటక రంగంలో నటనకు ఎక్కువ అవకాశం వుంటుందని, పైగా నటించేటప్పుడు నటనకు ప్రేక్షకుల ప్రతిస్పందన వెంటనే కన్పిస్తుందని, అది కళాకారునికి అతనిలోని కళాతృష్ణను సంతృప్తిపరచి మానసిక తృప్తిని కల్గిస్తుందని నమ్ముతారు పృధ్వీరాజ్. నాటక రంగం పట్ల, తన తోటి కళాకారుల పట్ల మక్కువకు నిదర్శనంగా ఆయన సినిమాల ద్వారా సంపాదించిన డబ్బుతో 1944లో 'పృధ్వీ థియేటర్స్' ను ప్రారంభించారు. మరుగున పడుతున్న నాటకరంగాన్ని వందలాది మంది నాటకకళాకారులను ఆదుకున్నారు. ఎందరి కుటుంబాలకో పెద్దదిక్కై నిలిచారు. పృధ్వీ థియేటర్స్ నుండి బయటకు వచ్చిన ఎందరో కళాకారులు గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందారు. బలరాజ్ సహానీ, దమయంతి సహానీ, ప్రేమ్‌నాధ్, షౌకత్ (షబనా అజ్మీ తల్లి), దర్శక నిర్మాత యల్.వి. ప్రసాద్, ఇంకా స్వయంగా పృధ్వీరాజ్ ముగ్గురు కొడుకులు రాజ్, షమ్మీ, శశిలు వీరందరూ పృధ్వీ థియేటర్స్ ద్వారా వెలువడిన కాంతి కిరణాలే.

కళ అనేది ప్రజలను ఆహ్లాదపరిచేది మాత్రమే గాక ఆలోచింపచేసేదిగా వుండాలి. ప్రజలను చైతన్యవంతులను చేయాలి అని పృధ్వీ గాఢంగా నమ్మేవారు. 'పృధ్వీ థియేటర్స్' ద్వారా ప్రదర్శితమయ్యే నాటకాలలో ఎన్నో సాంఘిక సమస్యలను, వాటి పరిష్కారాలను ప్రస్తావించే వారు. స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తితో పృధ్వీరాజ్ ఎన్నో నాటకాలను రచించి దర్శకత్వం వహించారు. సాంఘిక అసమానతలు, రాజకీయ అస్థిరత, దేశవిభజన సమయంలో ఏర్పడిన మతవైషమ్యాలు, జమీందారుల దురాగతాలు ఇవన్నీ కథాంశాలుగా ఎన్నో అద్భుతమైన నాటకాలను నిర్మించి పాత్రలకు జీవం పోసారు పృధ్వీ. జాతికి ఎంతో సేవ చేసారు. దేశ విభజన సమయంలో భారతదేశం అంతా హిందూ ముస్లిముల కొట్లాటలతో అట్టుడికి పోతుంటే వారి సమైక్యత అత్యవసరం అంటూ పృధ్వీరాజ్ ఎంతో కృషి చేసారు. తన జీవితాన్ని పణంగా పెట్టి, ఎన్నో బెదిరింపులు ఎదురైనా లెక్కచేయక ప్రజలను చైతన్యవంతులుగావిస్తూనే వచ్చారు. 'సరిహద్దుగాంధీ' 'ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్' జాతికి పృధ్వీరాజ్ చేస్తున్న సేవలను వేనోళ్ళ కొనియాడారు.

క్రమశిక్షణ, మానసిక ప్రశాంతత, నమ్మిన సిద్ధాంతాల ఆచరణ ముఖ్యంగా పృధ్వీరాజ్ భావించే వారు. పృధ్వీరాజ్ ఎప్పుడూ రంగస్థలం పైకి వెళ్ళేటప్పుడు తన తండ్రి పాదాలకు నమస్కరించేవారు. ఏ పని ప్రారంభించాలన్నా ముందు భగవంతుని పూజించి ప్రారంభించేవారు. ఇవే సంప్రదాయాల్నీ ఆయన కుమారులు కూడా అనుసరించ సాగారు. ఆర్. కె. ఫిల్మ్స్ ప్రారంభంలో శ్రీపృధ్వీరాజ్ పరమేశ్వరుని పూజిస్తూ ముందుగా కనపడతారు. సినిమా సెట్స్ పైన కానీ, నాటకం స్టేజీ పైన గాని, రిహర్సల్స్‌లో కానీ ఆయన సమయపాలనకు, క్రమశిక్షణకు, నిశ్శబ్దానికి ప్రాముఖ్యత నిచ్చేవారు. ఎటువంటి అనవసర శబ్దాలను సహించేవారు కారు.

పృధ్వీరాజ్ కపూర్ నలుబది రెండు ఏళ్ళ సినిమా జీవితంలో మొత్తం తొమ్మిది మూకీ సినిమాలలో, 72 టాకీ

సినిమాలలో నటించారు. కల్, ఆజ్ ఔర్ కల్ (నిన్న ఇవాళ, రేపు) ఆయన చివరి సినిమా ఆ సినిమా ప్రొడ్యూసర్ పృధ్వీరాజ్ పెద్ద కుమారుడు రాజ్‌కపూర్ కాగా, దర్శకుడుగా ఆయన మనుమడు రణధీర్ కపూర్ పనిచేసారు. ప్రస్తుతం నవతరం నాయిక కరిష్మాకపూర్ రణధీర్ కపూర్ తనయే. ఈ విధంగా ఒకే కుటుంబంలోని నాల్గుతరాలు చలన చిత్ర రంగాన్ని ప్రభావితం చేయడం బహుశా ప్రపంచం లోనే లేదేమో. 1960 లో విడుదలైన ముగల్-ఎ-అజామ్ లో శ్రీ పృధ్వీరాజ్ కపూర్ పోషించిన అక్బరు పాత్ర నాటి, నేటి, ప్రేక్షకుల హృదయాలలో చెరగని ముద్రవేసింది.

వ్యక్తిగతంగా దేశవిదేశాలలో ఆయన అందుకున్న పురస్కారాలకు లెక్క లేదు. 1966లో విడుదలైన ఆస్మాన్ మహల్‌లోని ఆయన నటనకు గాను చెకొస్లవేకియా అకాడమీ వారి అవార్డును అందుకున్నారు. భారత చలన చిత్ర సమాఖ్య నాయకునిగా చైనా, బర్మా, సింగపూర్, లావ్స్, ఇండోనేషియా వంటి ఎన్నో దేశాలు సందర్శించారు. భారత ప్రభుత్వం ద్వారా 'పద్మభూషణ్' అందుకున్నారు అత్యంత ప్రతిష్టాకరమైన దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు ఆయనను వరించింది. అయితే దురదృష్టవశాత్తు, అవార్డు స్వీకరించే లోపు ఆయన కన్నుమూసారు. సినిమా రంగానికి ఆయన పెద్దదిక్కు. 'పాపాజీ' అని ఆయనను అందరూ ఎంతో ఆప్యాయంగా పిల్చేవారు. రాజ్యసభ గౌరవమెంబరుగా డా॥ రాధాకృష్ణన్ ఛైర్మన్‌గా వుండగా శ్రీ పృధ్వీరాజ్ రాజ్యసభలో కూడా కాలు పెట్టారు.

తృణము తృణపంచు తృణీకారమేల?
తృణము లందునీకు తూష్ణీభావమేల!
తృణమదియె, కాని తెల్పు నొక్క సత్యమ్ము!
తలవంచు, తలదించు, అహమువీడు!

వృక్షమా నీవేమి తెల్పుచున్నావు, తెల్పువేగ!
శాంతమ్ము సహనమే భూషణంబు ఆత్మయోగి
మెప్పునాశింపకు, పరుల కర్మలనీ మెప్పు చేర్చు
నిరుతన నామస్మరణమే, ఇచ్చునీకు ముక్తి, కీర్తి

**జి.ఎస్.ఎస్. మూర్తి, హైద్రాబద్.**

వృత్తి పరంగా ఎన్నో ఆర్థిక ఇబ్బందులను, ఒత్తిడు లను, ఆటుపోటులను సమర్ధంగా ఎన్నుకొన్నారు పృధ్వీరాజ్. కొన్ని తప్పనిసరి పరిస్థితులలో తన కలల సామ్రాజ్యమైన పృధ్వీ థియేటర్స్‌ను మూసి వేయవల్సి వచ్చింది. ఎటువంటి పరిస్థితులు ఎదురైనప్పటికీ తన జీవిత విధానాన్ని, సిద్ధాంతాలను మార్చుకోలేదు ఆయన ఎన్నో లక్షలు సంపాదించినప్పటికీ, తన పాత 'మోరిస్ మైనర్' కారులోనే స్వయంగా తనే డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళేవారు పృధ్వీరాజ్. కొత్తకారు కొనమని సలహా ఇచ్చిన స్నేహితునికి ఆయన ప్రక్కనే కూర్చున్న తన భార్య కమలాసరానీను చూపిస్తూ 'నా జీవిత భాగస్వామి, నా తోడునీడగా నెన్నంటి నిలచిన ఈమెను, పాత ఆవిడ అయిపోయిందని వదలివెయ్య గలనా? ఇదీ అంతే!' అని నవ్వేసేవారు ఆయన.

ఎంతో పేరు, ప్రఖ్యాతులు, ఐశ్వర్యం సంపాదించి నప్పటికీ అంతే సహృదయంతో, ఎన్నో కుటుంబాలకు గుప్తదానాలు చేసేవారు. తను, తనతో పాటు తన వంశంలో నాల్గుతరాల వారితో కల్సి సినీ కళామతల్లికి సేవా నీరాజనాలు అర్పించి ధన్యులైనారు పృధ్వీరాజ్. నటనే వూపిరిగా సర్వస్వంగా భావించిన ఆయన తన చివరి రోజుల్లో బ్లడ్ ప్రెజర్, కిడ్నీ సమస్యలు, చక్కెర వ్యాధితో చాలా వేదన ననుభవించారు. పృధ్వీ థియేటర్స్‌ను తిరిగి తెరిపించాలనే కోరికను వెలిబుచ్చిన నెలకే ఆయన కనుమూసారు. మే 29, 1972, తన 66వ ఏట శ్రీపృధ్వీరాజ్ దైవసాయుజ్యమొందారు. రెండు వారాల అనంతరం ఆయన అర్ధాంగి రమ కూడా మృత్యువులో పతి ననుసరించారు. పృధ్వీరాజ్ తన పేరుకు తగ్గట్లుగానే చలనచిత్ర సామ్రాజ్యానికి మకుటంలేని మహారాజుగా వెలుగొంది తర్వాత తరాలకు మార్గదర్శకుడు, ఆదర్శ ప్రాయుడు అయినారు. హిందీ చలన చిత్రరంగానికి శ్రీపృధ్వీరాజ్ కపూర్ వంటివారు వేసిన పునాదిరాళ్ళపై ఆధారపడి నేటి బాలీవుడ్ నిర్మితమైనదంటే అతిశయోక్తి లేదు. సమాజంలో అణగారుతున్న విలువలను, మరుగున పడుతున్న కళలను తాను నిర్మించిన నాటకాల ద్వారా, సినిమాల ద్వారా ప్రజలకు అందించి వాటిని ఆదరింపచేసి, వారిని ఎంతగానో ప్రభావితంగావించిన పృధ్వీరాజ్ వైనం ఎంతో శ్లాఘనీయమైనది. అందు వల్లనే శ్రీపృధ్వీరాజ్ కళామతల్లికి ముద్దుబిడ్డ అయ్యారు సినీవినీలాకాశంలో ధృవతార అయ్యారు.

# సత్కర్మలు చేయండి! సమాజ సేవలో పాల్గొనండి!!

"మాసం హిత్వా ప్రియోభవతి
క్రోధం హిత్వా నశోచతి
కామం హిత్వార్థవాన్ భవతి
లోభం హిత్వా సుఖీ భవతి"

ప్రేమస్వరూపులారా!

మానవునియందు అహంకారం, ఆడంబరం ఉండినంతవరకూ ఏ వ్యక్తీ అతనిని ప్రేమించడు. కన్నబిడ్డలుగాని, కట్టుకున్న భార్యగాని అతనిని ప్రేమించరు. అహంకారం, ఆడంబరములు మానవుని యొక్క ప్రేమను అత్యంత దూరం చేస్తున్నాయి. ఏనాడు ఈ మానవుని నుండి ఈ అహంకారము, ఆడంబరములు తొలుగునో, ఆనాడే విశ్వమంతా అతనిని ప్రేమిస్తుంది. కనుక లోకం తనను ప్రేమించాలని ఆశించే వ్యక్తి తననుండి మొట్ట మొదట ఈ రెండునూ దూరం చేసుకోవాలి. ఏ మానవునియందు క్రోధం నిండివుండునో, అట్టి మానవునకు సుఖమనేది ఎక్కడా కనిపించదు. అతను నిరంతరమూ శోకిస్తూనే వుంటాడు. బహిర్ ముఖంగానో, అంతర్ ముఖంగానో, ఆ క్రోధము యొక్క ఫలితము శోకమే తప్ప అన్యము కానరాదు. కనుక మానవుని యొక్క శోకమునకు మూలకారణము క్రోధమే. కోరికలు వుండినంతవరకునూ మానవునకు సుఖమనేది కనిపించదు. ఏనాడు మానవుడు కోరికలను నిర్మూలనం గావించుకొనునో, ఆనాడే సర్వసౌఖ్యములూ అతనిని వరిస్తాయి. లోభం వుండినంతవరకునూ మానవునకు సౌఖ్యమనేది కనిపించదు. సర్వసుఖములూ లోభమును కోల్పోయినప్పుడే ప్రాప్తిస్తాయి. కనుక మానవునకు దుఃఖము, విచారము, అశాంతి - ఇవన్నీ లభ్యం కావడానికి కారణం ఈ కామక్రోధలోభ మోహములే.

నూతన సంవత్సరం ప్రారంభమవగానే, భవిష్యత్తు ఎలావుంటుందోనని ప్రతి ఒక్కరూ యోచిస్తుంటారు. దేశము యొక్క సౌభాగ్యం మానవుని యొక్క చర్యలపైన ఆధారపడి వుంటుంది. మానవుని చర్యలు మనస్సుపైన ఆధారపడి వుంటాయి. మనస్సు సంకల్పములపైన ఆధారపడి ఉంటుంది. సంకల్పములు ఎట్టివో, చర్యలు అట్టివే. కనుక విశ్వము యొక్క సౌభాగ్యమును కోరేటటువంటి మానవుడు, సంకల్పములను సత్య సంకల్పములుగా తీర్చిదిద్దుకోవాలి. సత్య సంకల్పములు కలిగినటువంటి మానవుడి ద్వారానే, ఈ జగత్తు శాంతి భద్రతలను అందుకుంటుంది. సర్వ సంకల్పములు మానవుని యొక్క కర్మలపై ఆధారపడి వుంటాయి. "కర్మాను బంధీని మనుష్య లోకే" లోకమంతా కర్మలపైన ఆధారపడి వుంటుంది. ఈ కర్మలే మానవుని బంధిస్తూ వస్తున్నాయి. పుణ్యపాపములు కూడనూ మానవుని కర్మల చేతనే బంధించబడుతున్నాయి.

## భగవాన్ సాయి దివ్యబోధ

ఆనంద దుఃఖములు కూడా మానవుని కర్మల చేతనే బంధింపబడి వున్నాయి. కాని ఇట్టి సత్యమును మానవుడు గుర్తించు కొనలేక, తనకు తోచినట్లుగా కర్మలనాచరిస్తుంటాడు. కాని ఆచరించే సమయంలో మాత్రం ఆనందాన్ని అనుభవిస్తుంటాడు. కాని తరువాత ఈ కర్మల ఫలితం కొండంత దుఃఖాన్ని అందిస్తుంటుంది. ఏ చిన్న కర్మచేసినా తత్ఫలితాన్ని మానవుడు అనుభవించక తప్పదు. కనుక ఈ సత్యమును గుర్తించి వర్తించాలి. ఏకర్మలు ప్రారంభించినా, ఇవి మంచివా? చెడ్డవా? అని ఆలోచించి ఆ కర్మలలో ప్రవేశించాలి. తొందరపడి కర్మలలో ప్రవేశించరాదు. Haste Makes Waste, Haste Makes Worry. So Do'not be in a Hurry, తొందరబాటుతో కర్మలనాచరిస్తే, రేపటి దినం దాని ఫలితాన్ని అనుభవించక తప్పదు. కనుకనే ఉపనిషత్తులు **"తస్మైనమఃకర్మణే"** అని బోధించినాయి. ఏ కర్మలు చేసేముందైనా సరే, మొట్ట మొదట ఆ కర్మలకు నమస్కరించి, ఆ కర్మలలో ప్రవేశించాలి. ఎందుకు కర్మలకు నమస్కరించాలి? **"ఓ కర్మదేవతా! నీవు నాచేత పవిత్రమైన కర్మలను ఆచరింపజేయి! పరోపకార సంబంధమైన కర్మలనాచరింపజేయి! పరులను బాధించనటువంటి కర్మలు**

నాచేత ఆచరింపజేయి!" అని ప్రతి కర్మకు నమస్కరించి ప్రారంభించాలి.

భారతీయ సంస్కృతియందు ఇదియే మూలాధారమైనటువంటిది. దీనికి ఒక చిన్న ఉదాహరణ. నాట్యం చేసే ముందు, నర్తకి కాళ్ళకు గజ్జలు కట్టుకునేముందు, ఆ గజ్జలకు నమస్కరించిన తరువాత, వాటిని కాళ్ళకు కట్టుకుంటుంది. ఒక తబలా వాయించే వ్యక్తి కూడనూ, వాయించేముందు దానికి నమస్కరించి ప్రారంభిస్తాడు. దీని అంతరార్థమేమిటి? మానవుడు తాను చేసే కర్మకు మొట్ట మొదట నమస్కరించి, తన చేత సత్కర్మములను చేయించమని ప్రార్థించడం. కనుకనే ప్రాచీన కాలమునుండి మన భారతదేశం ఈ కర్మలకు ప్రాధాన్యత యిస్తూ వచ్చింది.

కర్మలు చేయటం సులభమేగాని, కర్మల ఫలమును మోయటం చాలా కష్టము. ఏదో నిన్న ఒక కర్మచేశాను. అది తీరిపోయిందని భావించకూడదు. నీవు చేసిన కర్మ తీరిపోయిందిగాని, దాని ఫలం మాత్రం వెంటవస్తూనే వుంటుంది. అది నీ జీవితాంతం పీడిస్తూనే వుంటుంది. కనుక దివ్యమైన మానవజీవితాన్ని పొందినందులకు, సత్కర్మలలో మనం ప్రవేశించాలి. ఈ సత్కర్మల నాచరించని యెడల మానవజీవితం వ్యర్థమైపోతుంది. కనుకనే **సత్యమే నీతి, ధర్మమే రీతి, త్యాగమే ఖ్యాతి - ఈ నీతి, రీతి, ఖ్యాతి - ఈ మూడింటి యొక్క సమ్మిళితస్వరూపమే మానవజాతి.** అయితే ఈనాటి మానవుడు ఈ నీతి, రీతి, ఖ్యాతిని మంటగలిపాడు. కనుక మానవత్వమే మరుగున పడిపోయింది. మానవత్వం ఎలావుండాలి? తలచిన తలుపుకు, పలికిన పలుకుకు, చేసిన పనికి సన్నిహిత సంబంధం ఉండాలి. అయితే ఈనాడు దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు మానవులు. తలపులకు, పలుకులకు అనుగుణంగా ప్రవర్తించేవారు మహాత్ములు. విరుద్ధంగా ప్రవర్తించేవారు దురాత్ములు. ఏమానవుడూ దురాత్ముడు కావాలని ఆశించడుగాని, దుష్కర్మలు చేస్తున్నాడు.

*ప్రేమస్వరూపులారా!*

మానవ జన్మ చాలా ఉత్కృష్టమైనటువంటిది, సౌజన్యమైనటువంటిది, సౌశీల్యమైనటువంటిది. కనుక అట్టి పవిత్రమైన మానవజన్మను సార్థకం చేసుకోవాలి. సర్వ తపస్సుల యొక్క ఫలితం ఈ మానవజన్మ. ఇట్టి పవిత్రమైన మానవజన్మను చాలా తేలికగా చూస్తున్నాము. **"దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవస్సనాతనః"** ఈ దేహమే మన దేవాలయము. ఈ దేవాలయంలో 'ఆత్మ' అనే దేవుడు ప్రతిష్ఠితుడైవున్నాడు. ఇతను కదిలేటటువంటివాడు కాదు. ప్రతిష్ఠ అయిన విగ్రహం స్థిరంగా ఉంటుంది. కనుక అతనిని 'అస్థిరం' అనకూడదు. 'స్థిరం' అనాలి. **"నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్యశుద్ధ బుద్ధముక్త నిర్మల స్వరూపిణం".** అలాంటి ఆత్మతత్త్వము నివశించేటటువంటి దేహము ఈ మానవ శరీరం. అట్టి దేవాలయం కలిగి, అట్టి దేవుని నీయందే వుంచుకొని, దేవుని వెదకడానికి ఎక్కడికి పోతున్నావు? ప్రతి మానవదేహం ఒక దేవాలయమే. దేహమే దేవాలయం. ప్రతి దేవాలయం ఒక దైవమందిరమే. ఆ దేహంలోపల వున్న చైతన్యశక్తి భగవంతుడే. **"ఈశ్వర స్సర్వభూతానాం"** సర్వభూతములయందు ఈశ్వరత్వ ముంటున్నది. అయితే ఈనాడు ఈ సత్యమును ఎవ్వడూ గుర్తించటం లేదు. కనుక ఏవ్యక్తిని చూచినా ఒక దేవాలయమును చూచినట్లుగానే భావించాలి. ఆ దేవాలయంలో ఆత్మస్వరూపుడైన పరమాత్ముడున్నాడు. కనుక మనం ఎవరినీ దూషించకూడదు, ఎవరినీ హింసించకూడదు, బాధించకూడదు, నొప్పించకూడదు - ఈ సత్యమును గుర్తించినవాడే నిజమైన భక్తుడు. ఊరకనే ఇతరులను తిట్టడం, దూషించడం చేసేటటువంటి వ్యక్తి భక్తుడు ఎట్లా అవుతాడు? అటువంటివాడు పరమనీచుడు. కనుక మనం ఎవరిని దూషించినా, నీ ఆరాధనా దైవమును దూషించినవాడవే అవుతావు. కనుక ఈ దేహమనే దేవాలయం ఎంతో పవిత్రమైనటువంటిది. పై అందచందములకు మనం విలువ యివ్వకూడదు. అందులో ఆత్మస్వరూపుడైవున్న దేవుడికి ప్రాధాన్యత యివ్వాలి. ఆ దేవాలయం నుండి మన పవిత్ర కర్మలనాచరించాలి.

పన్నులు వసూలు చేయాల్సిందే. పన్నులు వసూలు చేయకుండా పరిపాలన చేయటం ఎలా? అయితే ఈనాడు కొందరు పన్నులు వేయకూడదు, ప్రజలకు సౌకర్యాలు మాత్రం చేయాలంటున్నారు. ఇది ఎలా సాధ్యం? పన్నులు వసూలు చేయాలి. ప్రజలకు అవసరమైన అనుకూలాలు చేయించుకోవాలి. అదే విధముగానే పన్నులు తీసుకొంటూ పరిపాలన చేస్తూ వచ్చాడు అశోక చక్రవర్తి. ఒక పర్యాయం

అతని జన్మదినం వచ్చింది. సామంతులందరూ పన్నులు వసూలు చేసుకొని తీసుకొని వచ్చి అశోక చక్రవర్తికి సమర్పించారు. కాని మగధ దేశం రాజు మాత్రం వట్టి చేతులతో వచ్చాడు. అప్పుడు అశోకుడు "మగధరాజా! ఈ రోజు నా జన్మదినమని తెలియదా? ఎందుకు ఖాళీ చేతులతో వచ్చావు?" అని ప్రశ్నించాడు? అప్పుడు మగధరాజు "ప్రభూ! ఈ సంవత్సరం మా రాజ్యంలో అధికవృష్టులు, అనావృష్టులు సంభవించాయి. నేను వసూలు చేసిన పన్నులన్నీ ప్రజల సంక్షేమానికి వినియోగించాను. త్రాగే నీటిని అందించాను. వైద్యాలయాలు కట్టించాను. పిల్లలకు విద్యాలయాలు నిర్మించాను. నేను వసూలు చేసిన పన్ను అంతా ఖర్చు అయిపోయింది. అందువలన తమకు ఈనాడు ఏమీ సమర్పించలేక పోయాను" అని చెప్పాడు. దీనికి అశోకుడు అమితంగా ఆనందించాడు. అప్పుడు మగధరాజును తన ప్రక్కన కూర్చోపెట్టుకొని "రాజా! నీవు చేసిన మంచిపనులు ఈ రాజులు ఎవ్వరూ చేయలేదు. నీవు చేసిన సదుపాయాలకు (నీరునందించడం, విద్య, వైద్యాలయాలు నిర్మించడం) ప్రజలు ఎంతో సంతోషిస్తున్నారు. కనుక నీకు, నేను కూడా సహాయం అందించదలిచాను" అని అంటాడు అశోకుడు. అశోకుడు చాలా ధర్మపరుడు, న్యాయశీలుడు. అతని పేరే 'అశోకుడు' అనగా **శోకము లేనివాడు అశోకుడు.** అలాంటి చక్రవర్తి హృదయమును కరిగింపజేశాడు తన సత్కర్మల ద్వారా మగధ చక్రవర్తి.

కనుక "**పరిపాలకులు ప్రజలకు త్రాగడానికి మంచి నీరును అందించాలి. వైద్యాలయములను నిర్మించి ప్రజలకు వైద్య సౌకర్యములను కల్పించాలి. విద్యాలయాలను నిర్మించి పిల్లలకు విద్యబోధించాలి. ఈ మూడూ ప్రధానం. 'విద్య' అనేటటువంటిది 'బుర్ర' (Head) కు సంబంధించినటువంటిది. 'వైద్యము' అనేటటువంటి 'గుండె' (Heart) కు సంబంధించినటువంటిది. 'నీరు' అనేది పూర్తి 'దేహము' (Body) నకు సంబంధించినటువంటిది. ఈ మూడింటిని సమకూర్చినటువంటివాడే 'గొప్పవ్యక్తి" అన్నాడు అశోకుడు.** ఇలాంటి త్యాగము చేసి సత్కీర్తిని పొందారు ఇలాంటి చక్రవర్తులు.

సత్కర్మలు చాలా ప్రధానమైనటువంటివి, ఏ మానవుడు మంచి కర్మల నాచరిస్తాడో! వాడికంటే మించినటువంటివాడు మరొకడు లేడు. అందువలననే నేను తరచుగా చెబుతుంటాను. సత్కర్మల ద్వారా సమాజ సేవలలో మీరు పాల్గొనండి. ఎందుకు? మీరు సమాజంలో పుట్టారు. సమాజంలో పెరుగుతున్నారు. ఈ సమాజం ద్వారానే ధనమును ఆర్జిస్తున్నారు. ఈ సమాజము ద్వారానే సంపూర్ణమైన ఆనందాన్ని పొందుతున్నారు. ఇంత సహకారమును పొందుతున్న ఈ సమాజమునకు కృతజ్ఞతలు చెప్పనవసరంలేదా? ఆ కృతజ్ఞతలు చూపించే నిమిత్తమై సత్కర్మలనాచరించాలి. సమాజములోని అందరికీ సేవలనందించాలి.

*ప్రేమస్వరూపులారా!*

నూతన సంవత్సరంలో, ముందు ఏవిధమైన కష్టములు సంభవిస్తాయోనని మనం విచారించనవసరం లేదు. మనం చేసే కర్మలు మంచివైతే, భవిష్యత్తు అంతా మంచిదే అవుతుంది. దేశం యొక్క సౌభాగ్యం మీ చర్యల పైననే ఆధారపడి వుంటుంది. భగవంతుడు ఏమాత్రం శిక్షించడు, రక్షించడు, రక్షించుకొనేది నీకునీవే. శిక్షించుకొనేది నీకు నీవే. అన్నింటికినీ భగవంతుడు 'తథాస్తు!' ...'తథాస్తు' అని ఆశీర్వదిస్తుంటాడు. నీ మంచి చెడ్డలకు నీవే మూలకారణం. కనుక సద్భావములను అభివృద్ధి పరచుకోండి. దుర్భావములను దూరం చేసుకోండి. సాత్వికాహారం తీసుకుంటే సద్భావములు ఆవిర్భవిస్తాయి. ప్రవృత్తి లక్షణాలు మనం సంపాదించుకున్నవే. నీవు సంపాదించుకోవలసింది నివృత్తి లక్షణాలు. అయితే అవికూడా నీయందే అణగివున్నాయి. దయ, ప్రేమ, సహనం, సత్యము, ధర్మము ఇవన్నీ సంపాదించేటటు వంటివి కావు. ఈ సద్భావములన్నీ హృదయమునుండి ఆవిర్భవించేటటువంటివి. దుర్భావములు తలనుండి

## శ్రీ సత్యసాయివాణి

"దేహము ఒక కెమేరా, దానిలోని మనస్సే లెన్స్. హృదయమే ప్లేట్. చీకటిని ఛేదించును ఫ్లాష్. చిత్తమే ఆకెమేరా స్విచ్. ఇట్టి విలువైన పవిత్రమైన కెమేరాను పరమాత్మునిపై త్రిప్పి, సరిగా ఫోకస్ చేసి, క్లిక్ చేసిన, ఆయన హృదయమున చక్కగా పడి, అక్కడే వారి ప్రతిబింబము నిలిచిపోవును."

ఆవిర్భవిస్తుంటాయి మీరు తలను అనుసరించకండి ఆ భావములను అంతర్ముఖం గావించుకోండి హృదయాన్ని అనుసరించండి హృదయమునుండే వస్తుంటాయి పవిత్రమైన భావాలు అనియే మానవతాగుణములు అవే సత్య ధర్మశాంతి ప్రేమ అహింసలు సత్యమునుండియే అన్నీ ఆవిర్భవిస్తున్నాయి సత్యము అనే కరెంటు, ధర్మమనే వైర్‌లో చేరి, శాంతి అనే బల్బులో ప్రవేశించడం చేత, ప్రేమ అనే ప్రకాశం వెలుగుతున్నది. ఈ ప్రేమ అనే ప్రకాశం వెలగడానికి శాంతి అనే బల్బు మూలకారణం ఈ శాంతి అనే బల్బుకు మూలకారణము ధర్మము అనే వైరు ఈ ధర్మమనే వైరుకు మూలకారణము సత్యము అనే కరెంటు కనుక సత్య ధర్మశాంతి ప్రేమలు అన్నీ కూడనూ ఏకత్వమైనప్పుడే నీవు మానవత్వం గలవాడివిగా వుంటావు అయితే ఈనాటి మానవునియందు ఈనాలుగూ లేవు ఇక మానవుడని చెప్పడానికి ఎలా వీలవుతుంది? ఇది నిస్సారమైన దేహమే. సారమైన ఈ వస్తువులు (సత్య ధర్మ శాంతి ప్రేమలు)ను నీ దేహములో ప్రవేశపెట్టుకోవాలి.

**'జంతూనాం నరజన్మదుర్లభం'** ఈ నరజన్మ చాలా దుర్లభమైనటువంటిది. ఇది కొనేటటువంటిదికాదు అద్దెకు తెచ్చుకునేటటువంటిది అంతకన్నాకాదు. అప్పు తీసుకొనే టటువంటిదికాదు. ఇది భగవంతుని యొక్క వరప్రసాదమే. కనుక భగవంతుడు ప్రసాదించిన ఈ దేహమును సరియైన మార్గంలో ప్రవేశపెట్టాలి సక్రమమైన మార్గంలో ప్రవేశ పెట్టాలి. ఇతరులకు దీని వలన సహాయం కలిగించాలి. భగవంతుడు మనకు చేతులనిచ్చింది కంకణాలను ధరించ డానికి కాదు, దానం చేయడానికి మనకు గొంతునిచ్చింది హారములను ధరించడానికికాదు సత్యమును పలకడానికి. మనకు చెవులనిచ్చింది అనవసరమైన ఇతరుల మాటలను వినటానికి కాదు పవిత్రమైన భావాలను వినడానికి. కనుల నిచ్చింది సినిమాలు, టి వీ లు చూడటానికి కాదు పవిత్ర మైన భగవంతుని సుందర రూపాన్ని తిలకించ డానికి నాలుకమీద భగవన్నామం నాట్యం చేస్తుండాలి చేతులు సమాజ సేవ చేస్తుండాలి

ఈనాడు నూతన సంవత్సరం నూతన భావములను మీహృదయాలలో నింపుకోండి ఆనందాన్ని అనుభవించండి, ఇతరులకు పంచండి ధనం కోసం పంచకండి ప్రేమ కోసం పంచండి కామ క్రోధలోభములకు ఏమాత్రం అవకాశం యివ్వకండి సంవత్సరము యొక్క మంచి చెడ్డలన్నియూ మానవుని యొక్క చర్యల పైననే ఆధారపడి వున్నది మానవుని యొక్క ప్రవర్తన పైననే ఆధారపడి వున్నది మానవుని యొక్క సంకల్పములపైననే ఆధారపడి వున్నది మీ సంకల్పములు మంచివైతే, భవిష్యత్తు మంచిదే అవుతుంది మీ చర్యలు మంచివైతే భవిష్యత్తు మంచిదే అవుతుంది దేశమంతా మంచిదిగా మారిపోతుంది నీకు నీవు చూచుకో ఎవరికి వారు చూచుకుంటే, అందరూ బాగుపడుతారు దేశం అభివృద్ధి గాంచుతుంది లోకంలో శాంతి నెలకొనాలని మనం ప్రార్థించాలి. అట్టి శాంతిని మనం సంపాదించాలంటే మనం ఆచరణలో ప్రవేశించాలి. ఆచరణ ముఖ్యం.

*(ది 5-4-2000న బృందావనంలో భగవాన్ సాయి చేసిన ఉగాది దివ్యసందేశము నుండి)*

### చందాదారులకు విజ్ఞప్తి

**చందాలు వెంట, వెంటనే రెన్యూల్ చేయండి! చందాలు పంపేటప్పుడు తమది పాత చందా? లేక కొత్త చందా? స్పష్టంగా తెలియ పరచండి! పాత చందా అయితే చందా నెంబరు పేర్కొనండి!**

**- సం**

# అంతరిక్షంలో ఆప్తమిత్రుడు

విమానాలను పైలట్ నడుపుతాడు. పైలట్ కూడా మనిషే. ఆకస్మికంగా తీవ్ర అస్వస్థతకు గురికావచ్చు. ఏ గుండెనెప్పో రావచ్చు. ఇటువంటి సందర్భంలో ప్రయాణికులకి, విమానానికి కూడా పెను ప్రమాదం పొంచి ఉన్నట్లేగా! ఇటువంటి విపత్కర పరిస్థితులు ఉత్పన్నం కాకుండా వుండేందుకు ప్రతి విమానంలోనూ కో పైలట్ కూడా ఉంటాడు. మరి అంతరిక్ష నౌకల పరిస్థితి ఏమిటి? అంతరిక్షనౌకలని సాధారణంగా ఒకరి కంటే ఎక్కువ మందే యాత్రికులు ఉంటారు. భద్రత విషయంలో పరస్పరం సహకరించు కోవడమే కాకుండా వారు నిర్వర్తించవలసిన విధులు ఎన్నో ఉంటాయి. అనేక కార్యాలను మనుష్యులు చేయడం అసాధ్యం. ఇటువంటి వాటిని అద్భుతమైన రీతిలో సహాయకారిగా ఉండగలిగే పరికరాన్ని అమెరికాలోని నాసా కేంద్రం రూపొందించింది. పర్సనల్ శాటిలైట్ అసిస్టెంట్ (పి.యస్.ఎ) అన్న పేరు పెట్టబడిన ఈ పరికరం పరిమాణంలో టెన్నిస్ బాల్ అంత ఉంటుంది. పిట్టకొంచెం కూత ఘనం అన్నట్లు ఇది పరిమాణంలో చిన్నదైనా చేసే ఘనకార్యాలు ఎన్నో ఉన్నాయి.

ఉదాహరణకి అంతరిక్ష నౌకలకి ఒక్కోసారి బయట నుంచి రిపేర్లు చేయవలసి వస్తుంది. ఇటీవల రష్యన్ అంతరిక్ష నౌక మీర్ ఇబ్బందులలో చిక్కుకుని, దానిని శాశ్వతంగా వదిలి వేయవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. అప్పుడు డిస్కవరీ నౌకలో అమెరికన్ అంతరిక్ష యాత్రికులు ఎంతో కష్టపడి దానిని బాగు చేయవలసి వచ్చింది. అదే పి.ఎస్.ఎ. అయితే సులువుగా నిర్వర్తించగలిగి ఉండేది. ఒకోసారి అంతరిక్ష నౌకలో అగ్ని ప్రమాదం సంభవించవచ్చు. అటువంటప్పుడు ఇది ఆ మంటల్లోకి దూసుకు వెళ్ళి వాటిని ఆర్పగలదు.

ఆ పి.ఎస్.ఎ. కూడా తల్లినంటి పెట్టుకున్న బిడ్డలాగా అంతరిక్ష నౌకతో పాటే రోదసిలో పరిభ్రమిస్తూంటుంది. ఈ కారణం వల్ల అది బయటనుంచి కాపలాదారుగా వ్యవహరిస్తుంటుంది. అంతరిక్షంలో ఉల్కలు వేలాది మైళ్ళ వేగంతో దూసుకు వస్తుంటాయి. అవి అంతరిక్ష నౌకను గుద్దుకుంటే చెప్పలేనంత అనర్థం కలుగగలదు. ఈ ప్రమాదాన్ని ముందుగానే పసిగట్టి నౌకలోని వారిని ఇది హెచ్చరించగలదు. ఇది బయట ఉండడంతో అనంత దూరాలలోవున్న నక్షత్ర మండలాలను, గెలాక్సీలను నిశితంగా పరిశీలించగలదు. వాటి ఫోటోలు తీయగలదు. ఈ పి.ఎస్.ఎ.లో మరో సౌలభ్యం ఉంది. దీనిని రిమోట్ కంట్రోల్ సాయంతో నౌకలోని అంతరిక్ష యాత్రికులు భూకేంద్రం మీదున్న శాస్త్రవేత్తలు కూడా నియంత్రించవచ్చు అంతేకాదు. ఇది ఈ ఇరువురి మధ్య టెలికాన్ఫరెన్స్

**కె.ఆర్.కె. మోహన్**

నడపడానికి కూడా వారధిలాగా పనిచేయగలదు. ఇందులో వుండే సున్నితమైన పరికరాల వల్ల ఇతరదేశాల అంతరిక్ష నౌకలు, భూకేంద్రాలకు సంబంధించిన రహస్యాలు కూడా ఇది పసిగట్టగలదు. అంటే అంతరిక్షంలో వుండే పోలీస్ డిటెక్టివ్ వంటిదన్నమాట. అంతరిక్షనౌకలో అమర్చితే లోపల వాతావరణంలో గల ఆక్సిజన్ శాతాన్ని ఎప్పటికప్పుడు గమనిస్తూ నావికులకు తగిన సూచనలు, హెచ్చరికలు చేయగలదు. ఇన్ని సౌలభ్యాలు కలిగి ఈ చిట్టిరోబో మైక్రోగ్రావిటీ విధానం ద్వారా అంతరిక్షంలో తిరగడానికి లోపల చిన్నచిన్న ఫాన్లను అమర్చితే సరిపోతుంది. ఈ పి.ఎస్.ఎ. కి పాక్షికంగా తెలివికూడా ఉంటుంది. మచ్చిక అయిన కుక్కలు యజమానిని గుర్తించినట్లు ఇవి అంతరిక్ష యాత్రికుల గొంతులను కూడా గుర్తించి వారి ఆదేశాలను స్వీకరించగలదు. ఒకవేళ ఏదైనా చిక్కుఏర్పడి లేదా చేయవలసిన కార్యాన్ని నిర్వర్తించలేని పరిస్థితి ఏర్పడితే ఆ విషయాన్ని నావికులకు తెలియజేసి ఆకార్యాలను చేసుకోవలసిందిగా సూచనలిస్తుంది. ఇంతటి బహుముఖ ప్రజ్ఞగల పి.ఎస్.ఎ.లో అచిరకాలంలో అంతరిక్ష పరిశోధనలోనే కాదు భూమిపై పలురంగాలలో విప్లవాన్ని సృష్టించనున్నాయి. ●

# గ్రుడ్డి, చెవిటి, మూగ..... వారు ఎవరు?

"కో అంధో? యో అకార్యరతః
కో బధిరో? యో హితాని నశృణోతి
కో మూకో? యః కాలే
ప్రియాణి వక్తుం న జానాతి."

గ్రుడ్డివాడు ఎవరు? చేయకూడని పనులు చేయడం యందు ఆసక్తి కలవాడు. చెవిటి వాడంటే ఎవరు? పెద్దలు చెప్పిన హితోక్తులు విననివాడు. మూగవాడంటే ఎవరు? సమయం వచ్చినప్పుడు ప్రియమైన మాటలు చెప్పనివాడు.

గ్రుడ్డివానికి కనిపించదు, చెవిటి వానికి వినిపించదు, మూగవానికి మాటలు రావు - ఇవి అంగవైకల్యంగల మానవుని యొక్క పైకి కనిపించే లక్షణాలు. అయితే పై శ్లోకం యొక్క అంతరార్థములను అర్థం చేసుకుంటే అసలు గ్రుడ్డివాడు ఎవరు? చెవిటివాడు ఎవరు? మూగవాడు ఎవరు? అనే విషయం బోధపడుతుంది.

కన్నులు ఉన్నందుకు మంచి దృశ్యములు చూడటం, మంచి పుస్తకములు చదవటం, దైవదర్శనం చేయటంలాంటి మంచి పనులను చేయాలి. ఇది భౌతికమైన కన్నులతో చేసే పనులు. అయితే గ్రుడ్డివారు ఈ పనులు మాత్రం చేయలేరు. అయితే ప్రతివారికి ఒక 'అంతర్నేత్రం' అనేది కూడా ఉంటుంది. దానినే 'జ్ఞాననేత్రం' అని అంటారు. అది తెరచుకుంటే సర్వమునూ చూడగలుగుతారు, మంచిపనులనే చేస్తారు. అది మూసుకొని పోయినవారే అసలైన గ్రుడ్డివారు. అప్పుడు చేయకూడని పనులు చేస్తారు. పాపకార్యాలను చేయడానికి ఏమాత్రం వెనుకాడరు.

చెవిటివాడు అంటే ఎవరు? ఏశబ్దమూ వినపడనివాడు. అయితే వినగలిగిన శక్తివుండి పెద్దల హితోక్తులు విననివాడు అసలైన చెవిటివాడు. అసలు భగవంతుడు చెవులను యిచ్చినది ఎందులకు? మంచి మాటలను, మధుర సంగీతమును, భగవంతుని గుణసంకీర్తనలను, పురాణ ఇతిహాసములను, గురువులు, పెద్దలు చెప్పిన నీతి సూక్తులను వినడానికి. కనుక భగవంతుడు ప్రసాదించిన చెవులను ప్రతి ఒక్కరూ సద్వినియోగం చేసుకోవాలి.

మూగవాడు అంటే ఎవరు? మాట్లాడటం రానివాడు. అయితే మాటలు వచ్చికూడా హితముగాను, ప్రియముగాను మాట్లాడనివాడు నిజమైన మూగవాడు. అసలు భగవంతుడు నోరు యిచ్చినది ఎందులకు? భగవన్నామ సంకీర్తన, ఉత్తమ గ్రంథపఠన, పదిమందికి పనికివచ్చే సత్యమైన, ప్రియమైన మాటలు చెప్పటం కోసమే మనకు వాక్కును ప్రసాదించాడు భగవంతుడు. **'కాలుజారితే తీసుకోవచ్చునుగాని, నోరుజారితే తీసుకోలేము గదా!'** కనుక భగవంతుడు ప్రసాదించిన నోరును ప్రతి ఒక్కరూ సద్వినియోగ పరచుకోవాలి.

పాపకార్యములను చూచి నిరోధించలేకపోయిన వారు గ్రుడ్డివారితో సమానమే. అసత్యవచనములను విని సహించినవారు చెవిటి వారితో సమానమే. అన్నీ తెలిసి కూడా, నిర్భయంగా సత్యమును పలకనివారు మూగవారితో సమానమే.

- సాయిప్రియ

## శ్రీ సత్యసాయి అనుగ్రహసారము

"సాయికార్యములేని జపతపాదుల వేల
విలువలే శూన్యమౌ కలిమియేల
సేవకత్వమునందు శిష్టభావములేక
నాయకత్వముశోభ నాణ్యమగున
త్యాగతత్త్వములేని యోగాలు నిష్ఫల
మైపోవు దివ్యగమ్యమును రాదు
ప్రేమ సూత్రమునందు ప్రీతియే లేకున్న
'భగవదుపాసనల్ సుగతి గనున్
చిత్శ్ళామయ సాధక జీవనమున
మంచి క్రమశిక్షణముకల మానవుండె
సత్యసాయి యనుగ్రహసారమరశి
ఆత్మచింతనామృతధారలందగలడు

- పంచాంగము శీనప్పశాస్త్రి, పుట్టపర్తి

# అంతరంగ తరంగాలు

## (స్వామితో ఇంటర్వ్యూలు - ఇన్నర్‌వ్యూలు)

ఒక సంవత్సరం, సూర్యుడు మకరరాశిలో ప్రవేశించే పవిత్రమైన మకర సంక్రాంతి పండుగ రోజున స్వామి మా కుటుంబమును ఇంటర్వ్యూకు, కాదు,కాదు, బాబా తరుచుగా చెపుతూన్నట్లు "ఇన్నర్‌వ్యూ" (అంటే "ఆత్మ దర్శనము"నకు) పిలిచారు.

ఇంటర్వ్యూ గదిలో స్వామి మెత్తని దిండుగల ఎత్తైన ముదురు ఎరుపు రంగు సింహాసనంలో కూర్చుంటూ మా అందరినీ ప్రేమపూర్వకంగా పలకరిస్తూ విభూతిని సృష్టించి, ముందుగా తనకు ఎడమప్రక్కన కూర్చున్న స్త్రీలకు పంచారు. తరువాత పండితులు, గౌరవనీయులు అయిన మా తండ్రిగారిని దగ్గరగా తన చరణకమలముల వద్దకు పిలిపించుకుని నన్ను మెత్తని, తన నునులేత పాదములను స్పృశించి, మెత్తగా ఒత్తడానికి అనుమతించారు. ఇది నాకు అంతులేని ఆనందమును ప్రసాదించింది.

ఆ తరువాత స్వామి మా తండ్రిగారిని అక్కడ ఆసీనులైన ఒక మాజీ వైస్ ఛాన్సలరు మరియు మాజీ విద్యాశాఖామాత్యులకు పరిచయంచేస్తూ, విజయనగర ఆస్థాన మహావిద్వాంసుడైన ఘండికోట సుబ్రహ్మణ్య శాస్త్రి నిస్సంశయంగా ప్రప్రథమ వేదపండితుడనీ, వేదములకు భాష్యము చెప్పగల సాటిలేని మేటి విద్వాంసుడని చెప్పారు. ఈ సందర్భముగా ఆయనతో సరితూగగల ఇతర సుప్రసిద్ధ వేదపండితుల పేర్లు ప్రస్తావనకు వచ్చినపుడు, సత్యసాయి సత్యమునే పలుకుతారని స్వామి ఉద్ఘాటించారు.

విజ్ఞాన శాస్త్రము మరియు ఆధ్యాత్మిక శాస్త్రము - వీటికి సంబంధించిన ఒక ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు స్వామి, బాహ్య ప్రపంచమునకు సంబంధించిన విజ్ఞాన శాస్త్రమును అధ్యయనం చెయ్యడంకంటే ఆత్మతత్త్వమునకు సంబంధించిన విజ్ఞాన శాస్త్రము అధ్యయనం చెయ్యడం చాలా అవసరమని సెలవిచ్చారు. భౌతికశాస్త్రము పదార్థము నకు కూడా సంభవిస్తాయని చెప్పారు. సచ్ఛీలము, ప్రేమ, నిస్వార్థసేవ మరియు మానవతా విలువలద్వారానే శాశ్వతమైన సత్ఫలితాలు ఒనగూరుతాయని ఆయన చెప్పారు. ఉదాహరణకు, తల్లి తన బిడ్డలలో ఎవరి అవసరాలకు సరిపడినట్లు వారికి ఆకర్షణీయమైన వివిధ రంగులలో ఉన్న చేదుమందును కూడా ప్రేమతో లాలిస్తూ పట్టిస్తుంది.

ఆనాటి ఇంటర్వ్యూకు పిలువబడిన బృందములోనున్న ఒక డాక్టరు కర్మ, పునర్జన్మల విషవలయమునుండి తప్పించుకోవడానికి వీలుపడుతుందా, అని స్వామిని అడిగాడు. తప్పక, అని స్వామి సెలవిచ్చారు. ఈ సందర్భముగా ఆయన కఠోరమైన క్రమశిక్షణ, భక్తి, దృఢ సంకల్పముల ద్వారా భగవంతుని అనుగ్రహమును పొంది చిరంజీవియైన బాలుడగు భక్తమార్కండేయుని ఉదాహరణగా చూపించారు.

## ఘండికోట వెంకట సుబ్బారావు

ప్రజలు, గ్లాసులో అడుగున ఉన్న చక్కెర కరగి పోయేలా బాగుగా కలుపకుండా దానిపైనున్న నీటిని మాత్రమే త్రాగుతారు. ఆ విధంగా భగవదనుగ్రహమనే మధుర పదార్థములను వారు పొందలేకపోతున్నారు, అని స్వామి చెప్పారు. ఈ సందర్భముగా ఆయన తైత్తిరీయ ఉపనిషత్తు లోని "రసోవైసః", అంటే, భగవత్తత్త్వము అమృతము వలె మధురమైనది, అని చాటే సూక్తిని ఉదాహరించారు.

తరువాత లోపలికి తీసికొనివెళ్ళి మాతో ప్రత్యేకంగా మాట్లాడుతూ మా తండ్రిగారి ఆరోగ్యము బాగుపడు తుందనీ, తాను సృష్టించి యిచ్చిన నీలకంఠేశ్వర లింగమునకు ప్రతిరోజూ అభిషేకము చేసి ఆ జలమును త్రాగితే విరిగిన తుంటి ఎముక వలన కలిగే నొప్పి కూడా తగ్గిపోతుందనీ చెప్పారు. ఆ తరువాత మా తల్లిగారి శిరస్సుపై తమ దివ్య హస్తము నుంచి ఆశీర్వదిస్తూ ఇటు వంటి ఆశీస్సులు పొందినందుకు ఆమె చాలా అదృష్టవంతు రాలని చెప్పారు. ఇంకా, స్వామి నన్ను, నా భార్యను విదేశములలోనున్న మా కుమారులను ఒకసారి చూచి అక్కడి వ్యవహారము లన్నిటిని చక్కబెట్టుకొని తిరిగి వచ్చేయమని సలహా యిచ్చారు. అప్పుడు మేము వృద్ధులై, అనారోగ్యముతో బాధపడుతూ లేవలేకుండా ఉన్న

మా తండ్రిగారిని విడిచిపెట్టి విదేశములకు ఎలా వెళ్ళగలము, అని నేను కొంచెం మొరాయించినపుడు, మా తండ్రిగారి ఆరోగ్యము, క్షేమ సమాచారములు తాను చూచుకుంటానని, ఆ విషయం గురించి మేము ఆందోళన చెందవలసిన పనిలేదని స్వామి అభయమిచ్చారు. నాకు సంబంధించినంతవరకు, కర్మకాండ కంటె భక్తి యోగమును ఆచరణలో పెట్టడం చాలా ముఖ్యమని స్వామి చెప్పారు. "శరీరము ఒక నీటి బుడగ వంటిది. ప్రాపంచిక విషయములను విడిచిపెట్టి ఆధ్యాత్మిక కార్యక్రమములు చేపట్టు", అని ఈ సందర్భముగా ఆయన నాకు సలహా యిచ్చారు. కర్మ సిద్ధాంతము తప్పించుకొనడానికి వీలు లేనిదైనప్పటికీ, భక్తి మార్గము ద్వారా దాని తీవ్రతను తగ్గించుకోవచ్చునని స్వామి చెప్పారు.

చివరగా కర్మ, భక్తి, జ్ఞానములు మూడు భగవంతుని చేరడానికి మార్గములు; కాని భక్తి దురాశ వలనను, జ్ఞానము క్రోధము వలనను కలుషితమవుతుంది. వీటిని నిస్వార్థ ప్రేమ, సేవల ద్వారా జయించవచ్చును. ఇదే రాముని పేరే రాజ యోగమని చెప్పి ఆనాటి ఇంటర్వ్యూను ముగించారు.

సాయి సమాజసేవా భవన ప్రారంభోత్సవం

# భగవంతుడు చిత్తచోరుడు, విత్తచోరుడు కాదు

ఈనాడు స్వచ్ఛంద సంస్థలు పెరుగుతున్నాయి. సేవాకార్యక్రమాలు అనేకం చేబడుతున్నారు. కాని సేవకు వెచ్చించే డబ్బుకన్నా మిన్నగా, ప్రచార ఆర్భాటాలకు ఎక్కువగా ఖర్చుచేస్తున్నారు. చేసేది కొంచెం, ప్రచారం ఎక్కువ. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఈ పద్ధతిని ఏమాత్రం అంగీకరించరు. "ఇది మనం ఎవరినీ ఆకర్షించుటకు చేసే Art (కళ) కాదు. మన సేవ Heart (హృదయం) నుంచి వచ్చేది. అప్పుడే Self Satisfaction (ఆత్మసంతృప్తి) ఉంటుంది. Art is External, Heart is Internal చెప్పేది చెయ్యాలి, చేసింది చెప్పాలి, చెయ్యందే చెప్పరాదు." అని అంటారు శ్రీ సత్యసాయిబాబావారు. అయితే ఈనాడు కలియుగ ప్రభావం వలన మానవుడు Art ను చూస్తున్నాడు, Heart ను మరచిపోతున్నాడు అదికాదు. మనం Art కు కాదు ప్రాధాన్యత యివ్వవలసింది, Heart కు యివ్వాలి. భగవంతుని మన హృదయంలో పెట్టుకోవాలి. భగవంతుడు హృదయవాసిగదా! భగవంతుడు నీ భావమును చూస్తాడేగాని, బాహ్యమును చూడడు. భగవంతుడు భావప్రియుడేగాని బాహ్యప్రియుడు కాదు. భగవంతుడు నీవు బాహ్యంగా చేసే ఆడంబరపు పనులను మెచ్చడు. భగవంతునికి కావల్సింది నీభావము. భగవంతునికి కావాల్సింది నీ మనస్సు. నీ డబ్బు కాదు. భగవంతునికి కావల్సింది నీగుణం, నీధనం కాదు. అందువలననే భగవంతుడు చిత్తచోరుడు, విత్తచోరుడుకాదు అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు. అయితే ఈనాడు చాలామంది చిత్తమును అర్పితం చేయలేక, విత్తమును చేస్తున్నారు. భగవంతుడు విత్తమునకు లొంగడు, చిత్తమునకు లొంగుతాడు. కనుక నీ హృదయం నీ మనస్సు పవిత్ర భావాలతో నిండాలి. సచ్చింతనంకు, సదాలోచనలకు నిలయం కావాలి, సమాజసేవలలో పాల్గొనాలి అప్పుడే భగవదాను గ్రహం లభిస్తుందని తూ.గో. జిల్లా రాయవరంలో నిర్మించిన భగవాన్ శ్రీ సత్యసాయి సమాజసేవా కేంద్రభవన ప్రారంభోత్సవ (ది. 9-4-2000) సందర్భమున జరిగిన సభలో శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి పేర్కొనినారు. ఈ సభకు SRMT జాయింట్ మేనేజింగ్ డైరక్టర్ శ్రీ ముళ్ళపూడి వీరవెంకట సత్యనారాయణరావు అధ్యక్షత వహించారు. ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్‌గారు ఈ నూతన భవనమును ప్రారంభోత్సవం చేశారు. శ్రీ సత్యసాయి సమితివారు నిర్మించిన ఉచిత వైద్యకేంద్రమును తూ.గో. జిల్లా కలక్టర్ శ్రీ సతీష్ చంద్ర IAS గారు ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవ సభలో అనపర్తి నియోజక వర్గ శాసనసభ్యులు శ్రీ వల్లమిల్లి మూలారెడ్డి, డా॥ టి. సత్యనారాయణరెడ్డి, డా॥ రెడ్డి గోపాల కృష్ణచౌదరి, డా॥ పడాల రామకృష్ణారెడ్డి ప్రభృతులు ప్రసంగించారు. శ్రీ గజ్జరపు కాశీ విశ్వనాథం వందన సమర్పణ చేశారు. ఓం శ్రీ సాయి ఛారిటీ ట్రస్టు వారు ఈ భవనాన్ని నిర్మించారు.

గ్రంథ సమీక్ష

## విశిష్ట స్తోత్రాల విశేష సంకలనం
# "స్తోత్రరత్నావళి"

"కోటి పూజా సమమ్ స్తోత్రమ్" అన్నారు పెద్దలు. మంత్రం స్తోత్రం కన్నా మహిమోన్నతమైనదైనా అది ఉపదేశం పొందితేతప్ప సిద్ధించదు. అయితే మన ప్రాచీన మహర్షులు బీజాక్షరాలను ఆయా స్తోత్రాలలో నిబద్ధం చేసి మంత్రంతో సమమైన స్థాయిని వారి తపశ్శక్తితో కల్పించి తత్సమమైన సత్ఫలితాలను మనం పొందగలిగేలా మనకనుగ్రహించారు. అలాంటి వాటిలో అనేకం వ్యాసుడు ఆయా సందర్భాలలో తన రచనలలో నిక్షిప్తం చేస్తే ఆచార్య శంకరులు అనేక స్తోత్రాలు కేవలం మనకోసమే అనుగ్రహించారు.

ఆధ్యాత్మ ప్రచారంలో అందెవేసిన చెయ్యిగా ఆధ్యాత్మవేత్తగా జగత్ప్రసిద్ధమైన బ్రహ్మశ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి గారు తాజాగా అనేక ప్రసిద్ధ స్తోత్రాలను గుదిగుచ్చి 'స్తోత్రరత్నావళి' పేర వెలువరించారు. వృద్ధులు సైతం కంటికి శ్రమలేని రీతిలో (ప్రచురించారో) పారాయణం చేసుకోవడానికి వీలుగా పెద్దటైపు అక్షరాల్లో 446 పేజీలతో ప్రచురించారు.

దాదాపు 70 స్తోత్రాలు సంకలనం చేసి వాటికి తోడుగా బలంగా లలిత, విష్ణు శివసూర్యసహస్ర నామ స్తోత్రాలు విశేషంగా ఇచ్చారు. ఇంకా అనుబంధంగా భగవద్గీత మూల పాఠంతో ఆఖర్న చేర్చారు. భారతీయ సంస్కృతిలో ఇవి అద్భుతమైన నిధులు. ఇవి భక్తుల పాలిటి కల్పవృక్షాలు, కామధేనువులు అన్న సంగతి వేరే చెప్పనక్కరలేదు. అది వేల సంవత్సరాలుగా భారతదేశంలో అనుభవైకవేద్యమైన విషయమే!

'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' గనక సూర్యసంబంధమైన సూర్యాష్టకమ్, ఆదిత్యహృదయమ్, సూర్యనారాయణ దండకమ్, సూర్యాష్టోత్తరనామాలు, సూర్యసహస్రనామ స్తోత్రమ్ ఇందులో సంకలనం చేశారు. ఇవి ఆరోగ్యప్రదాలు కాగా లక్ష్మీకవచమ్, కనకధారాస్తవమ్ శివస్తోత్రాలు ఐశ్వర్యప్రదాలు. వీనికి ఇతోధిక "బలప్రదం"గా శ్రీసూక్తమ్, పురుషసూక్తమ్, రుద్రనమకమ్, చమకం, మహాసంకల్పం కూడా ప్రత్యేక స్థానమాక్రమించాయి.

స్మరిస్తూనే సంతుష్టులై మనల్ని అనుగ్రహించి మన భయాలను దూరంచేసే ఆంజనేయ స్తోత్రాలు, దుర్గాస్తవరాజాలు విశేషమైనవి.

ఆధ్యాత్మరామాయణం నుండి అహల్యాస్తవాన్ని కూడా ఇందులో చేర్చారు. ఈ స్తోత్రపారాయణం వంధ్యల్ని సైతం పుత్రవతుల్ని చేస్తుందని ఫలశ్రుతి. సూక్ష్మంలో కంఠస్థం చేసుకొనగలిగే చఃు శ్లోకీ భాగవతమ్, సప్త శ్లోకీగీతా, దుర్గాసప్తశ్లోకీ లాంటి స్తోత్రాలు సదా స్మరించుకో దగినవి, శీఘ్రఫలప్రదమైనవి.

**జోస్యుల రామచంద్రశర్మ**

సర్వేశ్వరుణ్ణి సదా స్మరించుకో గలగడమే అసలైన సంపద. అది తెలియక అజ్ఞానంతో అహంకరించడమే అసలైన దారిద్ర్యం. సర్వేశ్వరుణ్ణి వివిధ స్తోత్రాలతో వివిధ రచనలతో పారాయణలతో నామార్చనకు వీలు కల్పించి ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులను చేయగల ఉత్తమ గ్రంథం 'స్తోత్రరత్నావళి' నిర్దుష్టమైన స్తోత్రాలు నిర్దిష్టమైన రీతిలో పారాయణం చేస్తే శీఘ్రఫలితాలు తప్పక కరతలామలకాలు అవుతాయనడంలో ఏమాత్రం సందేహించ నక్కరలేదు. అందుకు శ్రీ పురాణపండ వారి స్తోత్రరత్నావళి దోహదం చేస్తుందని ఆశిద్దాం.

ప్రతులకు సంప్రదించండి : పురాణపండ రాధాకృష్ణమూర్తి, రాజమండ్రి - 4.

## ధర్మవ్యాధోపాఖ్యానము

"అబ్రువన్ కస్యచిన్నిందాం
　ఆత్మపూజామవర్ణయన్
న కశ్చిద్గుణ సంపన్నః
　ప్రకాశో భువి దృశ్యతే"

ఇతరులను నిందించకుండా, ఆత్మప్రశంస చేసుకోకుండా ఉండే గుణవంతులు భూలోకంలో ఉంటారు. కాని అలాంటివారు పైకి కనపడరు.

# నాగపూర్ సత్యాగ్రహంలో తెలుగు పౌరుషాన్ని చాటిన దేశభక్తుడు

రాజమండ్రి నుండి ఒక చిన్న వారపత్రిక - ప్రజా పత్రిక - 75 సంవత్సరాల నుండి నిర్విఘ్నంగా వస్తోంది అంటే ఆశ్చర్యం కలిగించకమానదు. అంతకంటె ఆశ్చర్యమేమంటే తిరువూరు నుండి యిటువంటి పత్రిక వస్తోందని రాజమండ్రి పౌరులలో చాలామందికి తెలియకపోవటం. కాని ఈ పత్రిక తన 75 సంవత్సరాల జీవిత కాలంలో 403 వ్యాసాలు, 87 కథలు, 183 అనువాద వ్యాసాలు, యింకా ఎన్నో కవితలను ప్రచురించింది. వావిలాల గోపాలకృష్ణయ్య, నేదునూరి గంగాధరం వంటి వారెందరో ఈ పత్రికకు వ్యాసాలు రాశారు.

ఈ పత్రికను స్థాపించి సంపాదకత్వం వహించినది ప్రముఖ స్వతంత్ర సమరయోధులు శ్రీ చోడపాటి శివరామ కవి. ఈయన 1896 జూలై 4వ తేదీన రాజమండ్రిలో జన్మించారు. ఆజానుబాహుడు, స్ఫురద్రూపి. ఆయనకు ఆరోప్రాణం ఫుట్‌బాల్ ఆట, గుత్తి వంకాయ కూరట. ఫుట్‌బాల్‌ను ఆడుకోవడానికి ఎక్కడ ఎక్కువ అవకాశాలు ఉంటాయో అక్కడే చదువుకుంటానని ఆయన పట్టు పట్టారుట. అమలాపురం, రాజమండ్రిలో విద్యాభ్యాసం జరిగింది. ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తిచేశారు. రాజమండ్రిలో ఆనాటి ప్రధాన ఫుట్‌బాల్ కేసరి టీం సభ్యులుగా శివరామకవి ఉండేవారు. ఆజానుబాహుడు అయిన ఆయన గట్టి కిక్కుయిస్తే తప్పక గోలు అయ్యేదిట. ఆ కిక్కు ధాటి చూడ ముచ్చటగానూ అచ్చెరువు గొల్పించేదిగా ఉండేదిట.

ఇటువంటి వ్యక్తిపై మహాత్మాగాంధి ప్రభావం పడింది. ఆయన నడిపిన స్వాతంత్ర్య సమరంలో తలమునకలుగా పాల్గొన్నారు. నాగపూర్‌లో చారిత్రాత్మకమైన జండా సత్యాగ్రహం 1923లో జరిగింది. ఆ సత్యాగ్రహంలో పాల్గొనడానికి ఆంధ్రకేసరి ప్రకాశంగారి నాయకత్వంలో రాజమండ్రి యువకులు కొందరు బయలుదేరి వెళ్ళారు. వారిలో శివరామకవి, రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ ముఖ్యులు. సత్యాగ్రహులను పోలీసులు లారీలతో తీవ్రంగా బాదుతూ తీసుకువెళ్తున్నారు. పోలీసుల లాఠీ దెబ్బలకు భయపడి అక్కడ గుమిగూడినవారు సత్యాగ్రహంలో పాల్గొనడానికి భయపడ్తున్న సమయంలో ఈ సత్యాగ్రహాన్ని నడిపిస్తున్న ఒక జాతీయ నాయకుడు (జవహర్‌లాల్ నెహ్రూఅని కొందరంటారు). "మీరందరు ఎందుకు మౌనంగా ఉన్నారు. మీలో ఎవరూ దేశభక్తులులేరా" అని సవాలు చేశారు. దానికి ప్రతిస్పందిస్తూ శివరామకవి, మందేశ్వర శర్మ గార్లు 'మేం వున్నాం' అంటూ ముందుకు వచ్చారు. పోలీసులు వీరిద్దరినీ లారీలతో కొట్టి జైలుకు తీసుకువెళ్ళారు. వీరికి ఆరునెలలు జైలుశిక్ష విధించబడింది. కాని శివరామ కవి విషయంలో ఇది మరొక 5 నెలలు పొడిగింపబడింది. ఆ విధంగా నాగపూర్ జండా సత్యాగ్రహంలో శివరామకవి పదకొండు నెలలు జైలుశిక్షను అనుభవించారు.

**కంచి వాసుదేవరావు**

ఎలాగూ రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ గారి ప్రస్తావన వచ్చింది కనుక క్లుప్తంగా ఆయన వ్యక్తిత్వం గురించి తెలుసుకుందాం. ఆయన పశ్చిమగోదావరి జిల్లాకు చెందిన వారు.[1] ఆనాటి గిరిజనుల దురవస్థకు స్పందించి, వారి శ్రేయస్సు కోసం వారిలో సామాజిక రాజకీయ చైతన్యం కోసం తన యావత్తు జీవితాన్ని ధారపోశారు. తన సొంత ఇంటిని, ఐదెకరాల భూమిని గిరిజనులకు దానమిచ్చిన వితరణశీలి.

తిరిగి శివరామకవి విషయానికి వస్తే ఆయన తన 72వ యేట 1968లో దివంగతులయ్యేవరకు ప్రజా జీవితంలో ప్రముఖంగానే నిలిచారు. తను నమ్మిన ఆశయాలకు చివరివరకు కట్టుబడి ఉన్నారు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక భారత ప్రభుత్వం స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నవారిని స్వాతంత్ర్య సమర యోధులుగా పేర్కొని భూములు యిచ్చింది. ఈ సహాయం పొందడానికి జైలుకు వెళ్ళిన స్వాతంత్ర్య సమర యోధులు లాఠీల దెబ్బలు తిన్నవాళ్ళు దాదాపుగా పోటీ

పడ్డారు. కేవలం ఆరు నెలలు జైలుశిక్షపడినవారు, జైలుశిక్ష అనుభవించినా ఆర్థికంగా లేకుండా ఉన్నతస్థితిలో ఉన్నవారు అందరూ బారులుతీరి ప్రభుత్వ సహాయానికి అర్రులు చాచారు. అంతేకాదు దొంగ జైలు సర్టిఫికేట్లు సంపాదించుకుని స్వాతంత్ర్య సమరయోధునిగా ముద్ర వేయించుకొని భూములు సంపాదించుకున్నవారూ ఉన్నారు.

## మా త్యాగాలకు విలువ కట్టరు

'మేం నిస్వార్థంగా మీ స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నాం. జైలుశిక్ష అనుభవించాం. లాఠీల దెబ్బలు తిన్నాం. ఇంకా అనేక త్యాగాలు చేశాం. ఇవన్నీ దేశంపట్ల మాకుగల భక్తి బాధ్యతల వలన ఇవన్నీ చేశామేతప్ప ప్రతిఫలం ఆశించికాదు. మా త్యాగాలకు విలువ కట్టి యిచ్చే ప్రభుత్వ సహాయం తీసుకుని మమ్మల్ని మేం కించపరుచుకోలేం' అంటూ ధైర్యంగా ప్రభుత్వం ఇచ్చిన భూములను తిరస్కరించినవారు చాలా అరుదుగా కన్పిస్తారు. ఆర్థికంగా చితికిపోయివున్నా వీరు ప్రభుత్వం అందచేసిన సహాయాన్ని తిరస్కరించిన వైనం చూస్తే వారికి పాదాభివందనం చేయవలసి వస్తుంది. ఎక్కడో ఒక మద్దూరి అన్నపూర్ణయ్య, ఒక కొడాలి ఆంజనేయులు కన్పిస్తారు. అటువంటివారే శివరామకవిగారు. "నేను రాజకీయ బాధితుడనుకాను. స్వాతంత్ర్య సమర యోధుడను. నా త్యాగానికి ఖరీదు కట్టేదెవరు?" అని ఆయన ప్రశ్నించారు. ప్రభుత్వం యివ్వ జూపిన భూమినేకాదు ప్రభుత్వం యిచ్చే పెన్షన్‌ను కూడా ఆయన తిరస్కరించారు. ఆర్థికంగా అనేక ఇబ్బందులు పడుతూకూడా ఈ సహాయాన్ని తిరస్కరించడానికి ఎంతో గుండె ధైర్యం కావాలి.

1927లో మద్రాస్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలకు వెళ్ళినప్పుడు శివరామకవి ప్రయాణం చేస్తున్న బస్సు ప్రమాదానికి గురయింది. ఆయన తీవ్రంగా గాయపడ్డారు. ఆయన బ్రతికి బయట పడ్డారుగాని కుడికాలును మోకాలు నుంచి తీసివేయవలసి వచ్చింది. ఐనా ఆయన క్రుంగి పోలేదు. కుంటితనం ఆయనకు ఎట్టి అవరోధం కాలేదు.

ఆయన 1924లో చిత్తరంజన్ అనే పత్రికను ప్రారంభించారు. ఆయనపైనా, పత్రికపైనా సిఐడిల నిఘా ఉంటూ ఉండేది. పోలీసులను ఏమర్చడానికి ఆయన పత్రిక "మాస్ట్" మార్చివేస్తూ ఉండేవారుట.

1938లో తను నడుపుతున్న పత్రికను ప్రజా పత్రికగా రిజిష్టరు చేయించారు. బహుశ అంతకు పూర్వం 1924 నుండి ఆయన నడుపుతూ వచ్చిన చిత్తరంజన్ ప్రజా పత్రికగా పరివర్తనం చెందివుండవచ్చు. శివరామకవిగారు జీవించి ఉండగానే 1942 ప్రజాపత్రిక సంచికపై 1924లో స్థాపించబడినట్లుగా ముఖపత్రంపై పేర్కొన్నారు. కాని ప్రజాపత్రిక 1937లో స్థాపించబడి 1938లో రిజిష్టరయినట్లు అధికారికంగా తెలుస్తోంది. ఈ వైరుధ్యానికి కారణం తెలియదు. ఊహగానే తప్ప బహుశ చిత్తరంజన్ ప్రజా పత్రికగా నామాంతరం చెంది వుండవచ్చు.

1924లో ప్రజా పత్రిక స్థాపించబడినా స్థాపించబడక పోయినా ఆయన ఆ సంవత్సరం నుంచే తన ఆశయ సాధనకు జాతీయ స్వాతంత్ర్య భావాల వ్యాప్తికి పత్రికను సాధనం చేసుకున్నారన్నది నిజం. ప్రజాపత్రిక 1/4 డెమ్మీలో ప్రతి వారం (కొన్నాళ్ళు బుధవారం, మరికొన్నాళ్ళు శుక్ర వారం) క్రమం తప్పకుండా 8 పేజీలతో వెలువడేది. నిర్దిష్టమయిన స్థానాలలో సంపాదకీయం, ప్రత్యేక వ్యాసం, కథలు, చిత్రవాణి మొదలైన శీర్షికలు ఉండేవి. శివరామకవి సంపాదకీయాలు నిశితంగా, నిష్పక్షపాతంగా దేశభక్తి

ప్రేరకంగా ఉండేవి. హృదయం నుంచి చొచ్చుకు వచ్చిన దేశభక్తి భావాలతో శివరామకవి కలం చిందులు తొక్కేది. 1942లో క్విట్ఇండియా ఆందోళన సందర్భముగా కాంగ్రెస్ నాయకులు అరెస్టులు జరిగినందుకు నిరసనగా శివరామకవి సంపాదకీయ పేజీని ఖాళీగా వదలి వేశారు.

**ప్రకాశం గారిపై దావా :**

శివరామకవి ప్రకాశంగారి అనుచరులు. ఆయనపట్ల విశేషమైన గౌరవం, మర్యాద, భక్తికలవారు. అటువంటిది ఆంధ్రకేసరిపై కోర్టులో దావావేసి సంచలనం సృష్టించారు 1953లో ప్రకాశంగారు తమ ప్రజాపార్టీ తరుపున మద్రాస్‌లో ప్రజాపత్రిక అనే దినపత్రికను ప్రారంభించారు. అంతకు పూర్వం కొన్ని సంవత్సరాల క్రితం నుంచి తను "ప్రజా పత్రిక'' అన్న పేరుతో ఒక పత్రికను నిరాఘాటంగా నడుపుతున్నప్పుడు ఈ పేరుతో ప్రకాశం అంతటివారు ఒక పత్రికను ప్రారంభించడం, శివరామకవిగారికి ఆగ్రహం కలిగించింది. అంతేకాక ప్రకాశంగారు తన పత్రికకు ప్రముఖ పాత్రికేయుడూ, రాజమండ్రి వాస్తవ్యుడయిన క్రొవ్విడి లింగరాజుగారిని సంపాదకులుగా నియమించారు. లింగరాజుగారు, శివరామకవిగారు సన్నిహితులు. లింగరాజుగారికి శివరామకవి ప్రజాపత్రికను నడుపు తున్నట్లు తెలుసు. ప్రకాశంగారు తన పత్రికకు "ప్రజా పత్రిక'' అని పేరు పెట్టదలచినప్పుడు లింగరాజుగారికి కనీసం సంకోచం కూడా లేకపోయింది. పైగా మీ పత్రికను ప్రకాశంగారి ప్రజా పత్రికలో విలీనం చేయమని సలహాకూడా యిచ్చారు. ఆత్మగౌరవం, దేశభక్తి, పట్టుదల విషయంలో ప్రకాశంగారికి ఎంతమాత్రం తీసిపోని శివరామకవిగారు రాజమండ్రి రెండవ మున్సబు కోర్టులో దావావేశారు. ఐతే ఈ దావా ఒక కొలిక్కి రాకుండానే ప్రకాశంగారి ప్రజా పత్రిక ఆగిపోయింది.

శివరామకవిగారు కొంతకాలం శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు నడిపిన వజ్రాయుధం పత్రికకు విజయవాడ నుంచి వెలువడిన ఆర్యవైశ్య అనే పత్రికకు సంపాదకత్వం వహించారుట. కాని ఇది ధృవపడలేదు.

శివరామకవిగారికి తెలుగు, ఇంగ్లీషు, సంస్కృత భాషలలో ప్రావీణ్యం ఉంది. ఒరియా భాష కూడా కొంత వరకువచ్చు. శ్రీరామ నిర్యాణం, బుద్ధ చరితం అనే నాటకాలు రచించారు. వడ్డాది సుబ్బరాయకవి గారు శివరామకవికి కవితా గురువులు. శివరామకవిగారు 'కవి' అన్న పేరుతో ఒక పద్యకావ్యాన్ని ప్రారంభించారుట. ఆనాటి సాహిత్య పత్రికలకు వ్యాసాలు రాసేవారుట.

**తండ్రికితగ్గ తనయుడు :**

శివరామకవి గురించి చెప్పుకున్నప్పుడు ఆయన పెద్ద కుమారుడు బాలగంగాధర్ తిలక్ గారి గురించి చెప్పాలి. 1966లో శివరామకవిగారు పత్రికను పూర్తిగా తిలక్‌గారికి అప్పగించి బరంపురంలో ఉంటున్న తన రెండవ కుమారుని వద్దకు చేరుకున్నారు. 1968లో ఆయన దివంగతు లయ్యారు. 1966లో పత్రిక బాధ్యతను స్వీకరించిన తిలక్‌గారు 1989లో తను మరణించేవరకు అనేక ఆటుపోటులు ఎదుర్కొంటూ నడిపారు. తన తండ్రి అడుగుజాడలలో ఆయన తన బాధ్యతలను నిర్వర్తించారు. ఆయన దివంగతులయినప్పటికి రాజమండ్రిలోని సమాచారము దినపత్రిక యిల్లా రాసింది. "...... తండ్రి మరణానంతరం ప్రజా పత్రికను భుజాన వేసుకుని ఆర్థిక ఒడిదుడుకులను పత్రికా రంగంలో వస్తున్న సాంకేతిక పరమైన పరిణామాలను తట్టుకుంటూ నమ్మిన ఆదర్శాలకు

**శాంతి ధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి!**

"శ్రీరాముఁడంతటి శేముషిఁగనెవన్నఁ
  గౌసల్యమే కదా కారణంబు
కుశలవులందిన గొప్ప కీర్తికి మూల
  మవనిజాలయె కదా యరయగాను
వరవీర సింహమై వాసికెక్కె శివాజి
  ధర జిజియాబాయి తల్లికతన
గాంధీ మహాత్ముండు ఘనత వహింపఁగ
  పృథివి పుతలిబాయి పెంపకంబె
అమ్మ పదమునఁగల తొలి యక్కరంబు
  వర్ణమాలను బరికింపఁ బరుగునాది
యట్టి ఘనతను బొందిన యంబవీవె!
  శాంతి ధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి!"

**- కొంచన వెంకట రమణమూర్తి**

అద్దం పడుతూ స్థానిక మున్సిపల్ రాజకీయాల నుండి రాష్ట్ర రాజకీయాలదాకా నిర్భయంగా, నిష్పక్షపాతంగా తన పదునైన వ్యాఖ్యలతో ప్రచురించిన సత్తావారిది. ఏనాడు కాసుకోసం తన వాదనను అమ్ముకోని స్వతంత్ర వ్యక్తిత్వంగల శ్రీ తిలక్ ఆజన్మాంతం తన బాణీని మార్చుకోకుండగానే నిలబడ్డారు.ముఖ్యంగా మున్సిపాలిటీని తూర్పారబడుతూ వారుచేసే వ్యాఖ్యలు చదువరులను ఆకట్టుకునేవి. సోషలిస్ట్ భావాలంటే ప్రాణం పెట్టే శ్రీ తిలక్ మద్దూరి అన్నపూర్ణయ్య శిష్యుడు, రాజమండ్రి ప్రెస్సు క్లబ్బు సభ్యులైన తిలక్ క్లబ్బు ఉపాధ్యక్షులుగా, కోశాధికారిగా పనిచేశారు. జర్నలిస్ట్ కాలనీ ఆవిర్భావంలో శ్రీ తిలక్ పాత్ర విస్మరించరానిది. శ్రీ గౌతమీ గ్రంధాలయ కార్యదర్శిగా, చిన్నపత్రికల సంఘం ఉపాధ గా వారు వ్యవహరించారు. సిద్ధాంతాలను గౌరవించడం, వ్యక్తి ప్రమాణాలు కాపాడం లోనూ శ్రీ తిలక్ ఆదర్శప్రాయజీవి వంటివారు.

శివరామకవి ఏ మంచి ముహూర్తాన ఈ పత్రికను స్థాపించారోకాని తిలక్‌గారు మరణించిన తర్వాత కూడా ఈ పత్రిక నిరాఘాటంగా వస్తోంది.

సుదర్శన్ అనే యువజర్నలిస్ట్ కొంత కాలం ఆంధ్రభూమి దినపత్రికకు కోరుకొండ విలేఖరిగా పని చేశారు. శివరామకవి, తిలక్‌లు వెలిగించిన దీపాన్ని ఆరిపోకుండా సుదర్శన్ కాపాడుకుంటూ వస్తున్నారు.

### చిత్తుకాగితాలలో దొరికిన నిక్షేపం

చిన్న పత్రికలు ఏళ్ళ తరబడి వెలువడడం విశేషం అయితే ఆ కాపీలు భద్రంగా ఉండడం ఒక విశేషం. 1942 నుంచి నేటి వరకు వెలువడిన ప్రజాపత్రిక ప్రతులు భద్రంగా ఉన్నాయి. దీని వెనుక ఒక ఆసక్తిదాయకమయిన కథ ఉంది. శివరామ కవిగారు కాని, తిలక్ గారు గాని తమ ఇంటిలో పాత పత్రికలు భద్రపరచలేదు. కాని రాజమండ్రి లోని గౌతమీ గ్రంధాలయానికి ఈ పత్రిక వచ్చేది. 1942 నుంచి భద్రపరచిన కాపీలను గౌతమీ గ్రంధాలయ నిర్వాహకులు చిత్తు కాగితాల వ్యాపారస్తులకు అమ్మివేశారు. ఈ సంగతి ప్రస్తుత సంపాదకులు సుదర్శన్‌కు తెలిసి ఈ పత్రికలను కొన్న చిత్తు కాగితాల వ్యాపారస్తుని కలిసి అదృష్టవశాత్తు భద్రంగా ఉన్న ప్రజాపత్రిక సంచికలన్నింటినీ (1942 నాటి నుంచీ ఉన్నవాటిని) స్వాధీన పరచుకున్నారు.

ప్రజా పత్రిక 75 సంవత్సరాలు పూర్తిచేసుకున్న సందర్భంలో ప్రస్తుత సంపాదకులు ఒక చాలా చక్కని ప్రత్యేక సంచికను వెలువరించారు.

ఎన్నో మరుగున పడిన మాణిక్యాలు. అట్టి మాణిక్యాలలో శివరామకవి వారి పుత్రులు తిలక్‌గార్లు కొందరు మాత్రమే.

స్మరణీయులు - 10

## ఆడంబరాలకుపోని సామాన్యులు

బ్రిటన్‌లో ఒక ప్రధాని పదవీ విరమణచేసి, మరో ప్రధాని పదవీ స్వీకారం చేస్తే డేనింగ్ వీధిలోని 10వ నెంబర్ భవనంలో వింత సంప్రదాయం కనిపిస్తుంది. కొత్త ప్రధాని ప్రధాన ద్వారం గుండా లోపలికి ప్రవేశిస్తారు. మాజీగా మారిన ప్రధాని దొడ్డివాకిలి నుండి బయటికి వెళ్ళిపోతాడు. ఈ సంప్రదాయం ఒక్క బ్రిటన్‌లో మాత్రమే సాధ్యపడుతుంది!

కాని మన దేశంలో కూడా అలాంటి వారుండేవారు. మద్రాసులో రాజాజీ అలావుండేవారు. కేరళ మాజీ ముఖ్యమంత్రిఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్ అలావుండేవారు. ముఖ్యమంత్రి పదవి వారికి సేవాక్షేత్రం వారేనాడూ ఆడంబరాలకు పోలేదు. అస్సాంలో శరచ్చంద్రసింహ్ ముఖ్య మంత్రిగా వుండేవారు. అధికార బాధ్యతలు స్వీకరించిన తర్వాత వారు ముఖ్యమంత్రి నివాస భవనానికి వచ్చారు. చేతిలో ఒక హ్యాండ్‌బ్యాగ్‌తో! ముఖ్యమంత్రి నివాస భవనంలో అన్ని వసతులు కల్పిస్తారు. ముఖ్యమంత్రి పదవీ కాలం పూర్తి అయిన వెంటనే తమ హ్యాండ్ బ్యాగ్ తీసుకుని బయటికి వచ్చారు. వచ్చినప్పుడు ఏం పట్టుకొచ్చారో, నిష్క్రమించేటపుడు కూడా అవే దుస్తులు సామానులు. ముఖ్యమంత్రి అంటూవారు బహువేష ధారణ చేయలేదు. కొత్త దుస్తులు కుట్టించుకోలేదు. సాదా జీవితానికి మెరుగులు దిద్దిన అసామాన్యుడాయన.

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# జింక - నక్క - కాకి

మగధదేశంలో మందారవతి అనే అరణ్యం వుండేది. అక్కడ చాలా రోజుల నుండి ఒక జింకయు నొక కాకియు గాఢ స్నేహంతో నివసిస్తూ వచ్చాయి. ఆ జింక బాగా బలిసి అడవిలో స్వేచ్ఛగా తిరుగుతూ వుండింది. దాన్ని ఒక నక్క చూసి ఇట్లా తలపోసింది. "ఆహా! ఈ జింక యెంత ఒళ్ళు పట్టివుంది? దీని మాంసం నాకెలా దొరుకుతుంది? సరే, దీనికి నమ్మకం పుట్టిస్తాను" అని మెల్లగా దాని చెంతకు వెళ్ళి ఇలా ప్రస్తావించింది. "మిత్రమా! క్షేమమా?" అనగానే విని "నువ్వెవడవు?" అని జింక అడిగింది. "నేను నక్కను. నాపేరు సుబుద్ధి. నా చుట్టాలందరు నన్నొంటిగా విడిచి పెట్టిపోయారు. ఈ వనంలో చావలేక బ్రతుకుతూ వున్నాను. మరెవ్వరితో గాదు. దేవుడితో చెబుతున్నాను. విను నిన్ను చూస్తూనే నా బంధువులందరు కన్పడినంత సంతోషం కలుగుతూంది. మంచి వాళ్ళను దర్శించడం చేత పాపాలన్నీ తొలిగిపోయి, సమస్త శుభాలు చేకూరుతాయని పెద్దలంటారు. దానికిదే నిదర్శనం. నాకు నీతో సావాసం చేయాలని చాల ఇష్టంగా వుంది. నా ఇష్టాన్ని కాదనకు" అంటే విని, "మంచిది అట్లే కానిమ్మ"ని జింక నక్కను వెంటబెట్టుకొని పోయి సాయంకాలం తాము నివసించే ప్రదేశం చేరింది.

అక్కడి మందార వృక్షం మీద కాకి తన మిత్రుడైన జింకను చూసి "ఇతడెవ్వరు?" అని అడిగింది. "ఈతడు సుబుద్ధి అనే నక్కచాల వుత్తముడు. నా మైత్రి గోరి వచ్చినాడు" అని జింక చెప్పింది. ఆ మాటలు విని కాకి ఇలా అంది "కొత్తగా వచ్చినవాణ్ణి నమ్మవచ్చునా? ఇప్పుడు నువ్వు చేసిన పని మంచిది కాదు. కులం, శీలం తెలియక ఎవ్వరికిగాని తావివ్వడం తగదు" అనగా విని, నక్క కాకిని మిక్కిలి కోపంతో చూసి ఇలా అన్నది. "తొలి చూపునాడు జింకకు నువ్వు గూడ కొత్తవాడివే గదా! అదెట్లా నీతో జింకకు స్నేహం రానురాను వృద్ధియవుతూంది? నీకిక్కడ ఎదురులేదని నీతుల పేరుతో నోటికి వచ్చినట్లంతా వదరుతున్నావు. విద్వాంసుడు లేని చోట అల్పుడు గూడ గౌరవింపబడుతాడు. మానులేని దేశంలో ఆముదం చెట్టు కూడ గొప్ప వృక్షం కాదా! వీడు తనవాడని, వీడు పరాయి వాడనే తలంపు అల్పబుద్ధి వాళ్ళకే. మహాత్ములకు లోకమే కుటుంబం. ఈ జింక నాకు బంధువయినట్లు నువ్వు కావా? ప్రపంచం వున్నంతకాలం బ్రతకబోము. ఎప్పుడో యముడు కబళించేందుకు చూస్తున్నాడు. ఉన్నంతకాలం అందరికి మంచివాడనిపించుకొని పోవాలి. కాని ఇలాంటి వక్రబుద్ధి చేత ప్రయోజనమేముంది?"

అనగా విని మృగం ఇలా చెప్పింది. "ఎందుకీ వాదులాట? మనమందఱం ఒక్కచోటనె మంచిమాటలతో సుఖంగా కాలక్షేపం చేస్తాము. వీడికి వీడు మిత్రం, వీడికి వీడు శత్రువని నియమం వుందా? వ్యవహారం చేతనే మిత్రులుగాని, శత్రులుగాని కలుగుతున్నారు" అనగా విని, కాకి "అలాగే కానిమ్మ" అని పల్కింది. అనంతరం మృగ కాకి జంబుకాలు కడునేస్తం కలిగి ఆ వనంలో వాసం చేస్తూ వచ్చాయి.

యం. మునికృష్ణారెడ్డి

ఇలా కొన్నాళ్ళు గడిచాక, ఒకనాడు నక్క జింకతో ఇలా చెప్పింది. "చెలికాడా! ఈ వనంలో ఒకచోట నిండు పైరుండే పొలం నేడు చూచాను. నువ్వు నావెంట వస్తే నీకా పొలం చూపుతాను" అని మృగాన్ని పిలుచుకొనిపోయి ఆపంట చేను చూపింది. తరువాత ప్రతి దినం జింక అక్కడికి పోయి పైరు మేయసాగింది. ఒకనాడది పొలం యజమాని చూసి "ఈ జింక పైరు మేయమరిగింది. దీన్ని ప్రాణంతో వదలకూడదని" రహస్యంగా వలపన్ని ఇంటికి పోయాడు. ఎప్పటి వాడుక ప్రకారం మరుదినం జింక వచ్చి పొలంలో మేయడానికి దిగి వలలో చిక్కుకొని ఇలా చింతించింది. "అయ్యో! వలలో తగులుకొంటినే! ఇప్పుడు నా ప్రియ మిత్రుడు జంబుకం వస్తే నన్నీ గండం నుంచి తప్పిస్తాడు" అని అనుకొంటుండగానే నక్క వచ్చి చూసి

చాలా సంతోషపడింది "ఇన్నాళ్ళకు నా ప్రయత్నం ఫలించింది. పొలం కాపు దీన్ని ఈ దినం చంపక మానడు. దీని రక్తమాంసాలతో కావలసినన్ని ఎముకలు దొరుకుతాయి. నాకు నేడు గదా పండగ!" అని వువ్విళ్ళూరుతూ దగ్గఱికి వెళ్ళింది. మృగం నక్కను చూస్తూనే ఇంక భయం లేదనుకొని ఇలా వేడుకొంది. "చెలికాడా! శీఘ్రంగా వచ్చి వలకొఱికి నన్ను కాపాడు" అనగానే నక్క చెంతకు పోయి వల చూసి "మిత్రమా! ఈ వల నులినరాలతో చేయబడింది. నేడు ఆదివారం నరాలను నేనెట్లా పండ్లతో తాకుతాను? మనస్సులో మరో విధంగా అనుకోవద్దు. మరేవనిగాని చెప్పితివా, ఇప్పుడే తలతో చేస్తాను" అని బుకాయించింది.

అంతలో సాయంకాలం కావచ్చింది. కాకి తన మిత్రం జింక తావుచేరనందుకు చాలా చింతిస్తూ, అక్కడక్కడ వెదకుతూ, ఆ పొలం వద్దకు వచ్చి చూసి, "చెలికాడా! ఇది యేమి? అని అడిగింది. మిత్రుని మాట వినని దానికిది ఫలితం. చేటుకాలం దాపించినవాడు మిత్రుని మాట ఎందుకు వింటాడు?" అని జింక అంగలార్చింది. అది విని కాకి, "ఆ నక్క యెక్కడ?" అని అడిగింది. నా మాంసం తినడానికి ఇక్కడెక్కడో కాచుకొనివుంది" అని మృగం చెప్పింది. అది విని వాయసం ఇలా అనింది. "నేను మునుపే చెప్పాను గదా! నా మాట వినకపోతివి. నేనితరు లకు కీడు చేయడంలేదు. వాళ్ళున్నూ నాకు కీడు చేయరని నమ్మడానికి లేదు. మంచివాళ్ళకుగూడ దుష్టుల వల్ల చెఱుపు కల్గుతుంది. ఎదురుగ తీపి మాటలు చెప్పి, మరుగున కీడుతలపెట్టేవాడు పైన పాలు, లోపల విషం వుండే కుండ వంటివాడు. అట్టివాడి సహవాసం తప్పక మానుకోవాలి" అనగా విని హరిణం నిట్టూర్పు విడిచి ఇలా పల్కింది. "మంచి వాళ్ళ సాంగత్యం వల్ల సర్వశుభాలు సంప్రాప్తిస్తాయి. దుష్ట సాంగత్యం వల్ల సర్వానర్థాలూ సంభవిస్తాయి. అందుకు సందేహమే లేదు. ఆ జిత్తులమారి నక్క యొక్క తేనె మాటలకు మోసపోయాను. నాలికతీపు, లోపల విషమని తెలియక పోయాను" అని చెబుతూవుంటే దూరంలో వస్తున్న పొలంకాపును చూసి, కాకి ఇలా చెప్పింది" మిత్రమా! ఇప్పుడు తగిన వుపాయం ఆలోచింపక ఆలస్యం చేస్తే కొంప మునుగుతుంది. అదిగో! పొలం కాపు చేత దుడ్డు కఱ్ఱ పట్టుకొని యముడిలాగ వస్తున్నాడు. నాకో వుపాయం తోస్తూవుంది. విను. ఊపిరి బిగబట్టి, కడుపు వుబ్బించి నాలుగు కాళ్ళు బార్లజాపి, బిఱ్ఱబిగిసి, చచ్చిన దాని మాదిరి పడివుండాలి. నేను నీ మీదకెక్కి నీ కన్నులు పొడుస్తున్నట్లు కూర్చుంటాను. నేను సమయం చూసి కూస్తాను. కూస్తూనే పాఱిపో" అని చెప్పిచ్చింది.

పిమ్మట జింక కాకి చెప్పినట్లుగా పడివుండింది. పొలం కాపు దగ్గఱికి వచ్చి చూశాడు. జింక కన్నులు పొడుస్తున్నట్లు నటిస్తుండిన కాకి ఎగిరి, చెట్టుపై కూర్చుండింది. జింక చచ్చిందని ఎంచుకొని కాపువల వదిలించాడు. ఆ వెంటనే కాకి కూసింది. అది విని జింక త్వరగా లేచి పరుగెత్తింది. "ఆహా! ఇదెంత మాయలమారి జింక! నన్ను ఏమార్చింది గదా!" అని పొలంకాపు తన బరిసెను విసిరివేశాడు. దైవవశాత్తు దాని మోదుపడి నక్క చచ్చింది. చూశారా! నక్క ఏమి తలచిందో! తుదకేమయిందో!

**నీతి : పరులకు కీడు తలపెట్టేవాళ్ళు తామే చెడిపోతారు.**





# బుధవారం - బుద్ధిప్రదాతలు



శ్లో॥ సరస్వతి మహాభాగే విద్యే కమలలోచనే
విద్యారూపే విశాలాక్షి విద్యాం దేహి నమో஽స్తుతే

ఓ! చదువుల తల్లీ! సరస్వతీ! నీవు నా వాక్కునందు నిలిచి నా వాక్కును సత్యమైనదిగాను, పవిత్రమైనదిగాను ఇతరులకు సంతోషాన్ని ఆనందాన్ని కలిగించే విధంగా ఉండేట్లు అనుగ్రహించు. నేను నేర్చుకున్న విద్య సంస్కారముతో కూడినదిగాను అందరికి పనికి వచ్చేదిగాను ఉండేటట్లు ఆశీర్వదించమని నా హృదయపూర్వకముగా వేడుకుంటూ నమస్కరిస్తున్నాను అని ఆ సరస్వతీ దేవిని మనము ప్రతిదినము పూజిస్తాము. ప్రార్థిస్తాము. "విద్య లేనివాడు వింత పశువు" అన్నారు. కాబట్టి ప్రతి ఒక్కరూ విద్యావంతులు కావాలి. అటువంటి చదువుల తల్లికి ప్రీతికరమైన రోజు బుధవారము. బుధవారం ఏ దేవతను పూజించాలి అనుకుంటాము. బుధవారం సరస్వతీ దేవికి చాలా ఇష్టమయినరోజు అంటారు కొందరు.

బుధవారం విఘ్నేశ్వరునికి ఇష్టమయిన రోజు అని ఆ రోజు వినాయకుని పూజించి ఉండ్రాళ్ళు నివేదిస్తే సిద్ధ గణపతి సర్వసిద్ధులను ప్రసాదిస్తాడని మరి కొందరంటారు. "సర్వ విఘ్నహరం దేవం సర్వసిద్ధి ప్రదాయకం" అన్నట్లు సర్వకార్యములను నిర్విఘ్నముగా చేయించువాడు సద్గుణములను ప్రసాదించువాడు అయిన గణపతిని, విద్యాధి దేవత అయిన వాగ్దేవిని ఈ ఇరువురిని బుధవారం నాడు మనము పూజిస్తే ఇక మనకు లోటేమున్నది?

ఇంకొంత మంది బుధవారం మధురాష్టకం చదువు కుంటే చాలా మంచిదని అంటారు. మధురాష్టక మనగా మధురానాధుడు శ్రీ కృష్ణపరమాత్మయే గదా! ఆ మధురా ష్టకంలో శ్రీకృష్ణుని నఖశిఖ పర్యంతము మధుర మైనదని వర్ణించబడినది. అధరం మధురం వదనం మధురం నయనం మధురం హసితం మధురం మధురాధి పతే రఖిలం మధురం. అవేకాక హృదయం, వచనం, చరితం, సఖ్యం, గీతం, రూపం, ఒకటేమిటి? సర్వము మధురమే. మధురాతిమధురం. ఎందుకనగా! స్వామి రూపమా? చెప్పనవసరంలేదు. జగత్తునే మోహింపజేసిన జగన్మోహనుడు శ్రీకృష్ణుడు. పసితనంలో శ్రీకృష్ణుని ముద్దు ముచ్చట్లు ఎంతో మధురమైనవి. పసిపిల్లలతో సహా శ్రీబాలకృష్ణుని లీలలను తలుచుచూ తన్మయులవుతారు. ఋషులు మునులు యోగులు యోగేశ్వరేశ్వరుడయిన శ్రీకృష్ణుని జగద్గురువుగా, సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపునిగా భావించి పూజించి తరించేవారు. ఆ మురళీమోహనుని మురళీ గానానికి మానవులేకాక పశుపక్షి మృగాదులు కూడా పరవశించేవి. ఆబాలగోపాలాన్ని మురిపించి మైమరపించిన ఆ నీలమేఘశ్యాముని అణువణువూ మధురమైనదే. ఆ నల్లనయ్య తలపే ప్రతివారికీ మైమరపు. బుధవారంనాడు భక్తి శ్రద్ధలతో ఆ మధురమూర్తిని మనసులో నిల్పుకొని మధురాష్టకాన్ని పదేపదే పఠిస్తే దాని ఫలితం ఇంతింతని చెప్పలేము. ముగ్గురు ముఖ్యమయిన దేవతలను పూజించే పవిత్రమైన రోజు బుధవారం కాబట్టి మనకు బుధవారం కూడా పవిత్రమైనదే. ✪

**కొమరగిరి జయప్రద**

## విదురనీతి

"న జీయతే చానుజిగీషతే஽న్యా
న్న వైరకృచ్చా ప్రతి ఘాతకశ్చ
నిందా ప్రశంసాసు సమస్వభావో
న శోచతే హృష్యతి నైవ చాయమ్."

ఎవడు ఇతరులచేత జయింపబడడో, ఇతరులను కూడా జయింపదలచడో, ఇతరులతో కలహించడో, ఇతరులకు హాని కలిగింపగోరడో, ఎవడు నిందయందు, స్తుతియందున్ను సమమైన భావము కలిగియుండునో - అట్టివాడు హర్షశోకములకు అతీతుడు.



# రామ మంత్ర మహిమ



లంకా విజయానంతరం అయోధ్యానగరంలో శ్రీ రామ చంద్ర భగవానుడు రాజదర్బార్‌లో విరాజిల్లుతున్నాడు. ఆ సమయంలో శ్రీరామునికి కొన్ని అత్యవసర విషయాలను నివేదించే మహా సంకల్పంతో దేవర్షి నారదుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠాది ఇతరేతరులగు అనేకమంది మహర్షులూ విజయం చేశారు. ఒకానొక ధార్మిక విషయంపై తీవ్రంగా చర్చ కొనసాగుతుండగా నారద దేవర్షి అందుకొని - "ఇక్కడ సమావేశమైన వారందరినీ ఒక్కటే ప్రార్థిస్తున్నాను. భగవంతుని నామం గొప్పదా? భగవంతుడు గొప్పవాడా? ఈ విషయాన్ని తేల్చి చెప్పండి." దానిపై సభలో విశేషంగా వాగ్వివాదం చెలరేగింది. అయినా రాజసభలోని ఋషిగణం ఓ నిర్ణయానికి రాలేకపోయారు. చిట్టచివరకు నారద దేవర్షి తన అంతిమ నిర్ణయాన్ని వ్యక్తీకరిస్తూ నిశ్చయంగా నామి కన్న నామమే శ్రేష్ఠమైనది. రాజసభ ముగించడానికి ముందుగానే ఉదాహరణ పూర్వకంగా ఈ విషయం ప్రమాణీకరింపబడుతుంది అన్నాడు.

తరువాత నారద మహర్షి మారుతిని తన సమీపానికి పిలచి-"మహావీరా! నీవు సామాన్య రీతిగానే ఋషులకూ శ్రీరామునికీ కూడ నమస్కరించు.అప్పుడు విశ్వామిత్రునకు మాత్రం .నమస్కరించకు" అన్నాడు. అందుకు హనుమంతుడు అంగీకరించాడు. ప్రణామ సమయం రాగానే హనుమంతుడు ఋషులందరికీ నమస్కరించాడు. కానీ విశ్వామిత్రునికి మాత్రం నమస్కరించ లేదు. దానితో విశ్వామిత్రమహర్షి మనస్సు క్షుబ్ధమయింది

అంత నారదుడు విశ్వామిత్ర మహర్షిని సమీపించి "మహామునీ! హనుమంతుని ధృష్టత్వాన్ని తిలకించినారా? నిండు సభలో మీకు తప్ప అతడందరికీ నమస్కరించాడు. మీరతణ్ణి అవశ్యం శిక్షించాలి. వీడెంత గర్వియో? ఉద్దండుడో మీరే చూడండి" అన్నాడు. అంతే, దానితో విశ్వామిత్ర మహర్షి అగ్నిహోత్రుడై పోయాడు. అతడు రామప్రభువును సమీపించి "రాజా! నీ సేవకుడైన హనుమంతుడు ఇందరికి నమస్కరించి నన్ను అవమానించాడు. కనుక రేపు సూర్యుడు అస్తమించే లోగా నీ చేతులతో అతనికి మరణదండన విధించాలి" అన్నాడు. విశ్వామిత్రుడు శ్రీరామునికి గురువు, కనుక రాజారాముడు అతని ఆదేశాన్ని పాలించవలసినదే. ఆ క్షణంలో శ్రీరాముడు నిశ్చేష్టుడైపోయాడు. కారణం తన చేతులతో అనన్య స్వామి భక్తుడైన తన మారుతికి మరణదండన విధించాలి. ఈ విషయం క్షణ కాలంలో నగరం అంతా వ్యాపించిపోయింది.

హనుమంతునికి కూడ మహా దుఃఖం కలిగింది. అతడు నారద మునిని సమీపించి "దేవర్షీ! నన్ను రక్షించండి. శ్రీరామచంద్ర భగవానుడు రేపు నన్ను వధిస్తాడు. నేను మీరు చెప్పినట్లే చేసినందుకు ఫలం అనుభవించినాను. ఇప్పుడు నేనేమి చెయ్యాలి" అనగా దేవర్షి - "ఓ

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

హనుమంతా! నిరాశపడకు నేను చెప్పినట్లు చెయ్యి. బ్రహ్మ ముహూర్తంలో లేచి సరయూ నదిలో స్నానమాచరించి చేతులు జోడించి, ఓం శ్రీరామ జయరామ జయజయ రామ" అన్న మంత్రాన్ని జపించు, అంతే విశ్వాసపూర్వకంగా చెబుతున్నాను నీకే భయం రాదు.

మరునాడు తెల్లవారింది. సూర్యోదయానికి పూర్వమే హనుమంతుడు సరయూ నదిని చేరాడు. స్నానం చేసి దేవర్షి చెప్పిన ప్రకారం చేతులు జోడించి భగవంతుని ఉపర్యుక్త నామాన్ని జపించసాగాడు. ప్రాతఃకాలం కావడంతో హనుమంతుని కఠిన పరీక్షను తిలకించాలని నాగరికులు గుంపులు గుంపులుగా వచ్చేశారు. శ్రీరామ చంద్రుడు హనుమంతునికి దూరంలో నిలబడి తన పరమ సేవకుణ్ణి కరుణార్ద్ర దృష్టితో చూడసాగాడు. కాలం ఆసన్నం కావడంతో అనిచ్ఛా పూర్వకంగానే హనుమంతుని పై బాణాలను వర్షింప జేయసాగాడు. కాని అతని ఒక్క బాణం కూడ హనుమంతుని బాధింపలేక పోయింది. ఆ రోజల్లా బాణాలు వర్షింపబడుతున్నాయి. కాని అవి హనుమంతునిపై పడడంలేదు. కుంభకర్ణాది మహారాక్షసుల్ని వధించటంలో ప్రయోగించిన భయంకరాస్త్రాలను కూడ ప్రయోగించాడు.

అంతలో శ్రీరామచంద్రుడు బ్రహ్మాస్త్రాన్ని ఎత్తాడు. హనుమంతుడు ఆత్మసమర్పణ చేసి పూర్ణ భావంతో మంత్రాన్ని తీవ్రవేగంతో జపిస్తున్నాడు. ఆతడు రాముని వైపు చిరునవ్వుతో చూస్తున్నాడు. స్థిరభావంతో నిలబడి పోయాడు. అందరూ ఆశ్చర్యంతో చూస్తూ హనుమంతునికి జయ జయకారాలు పలుకసాగారు. అట్టి స్థితిలో నారద మహర్షి విశ్వామిత్రుని సమీపించి - ఓ మహర్షీ! ఇక మీరు విరోధాన్ని ఉపసంహరించుకొనెదరుగాక! శ్రీరామచంద్రుడు అలసి ఉన్నాడు. వివిన్న ప్రకారాలైన బాణాలు కూడ హనుమంతుని ఏమీ చేయలేకపోయినాయి. హనుమంతుడు మీకు నమస్కరించక పోతే పోయిన దేమున్నది? ఈ సంఘర్షణ నుండి శ్రీరాముని రక్షించండి. ఈ ప్రయాస నుండి అతణ్ణి నివృత్తుణ్ణి చేయండి. మీరంతా శ్రీరామనామ మహాత్మ్యాన్ని చూచినారు కదా! ఆ మాటలకు విశ్వామిత్ర మహర్షి ప్రభావితుడైపోయడు. "రామా! బ్రహ్మాస్త్రాన్ని హనుమంతునిపై ప్రయోగించవద్దు" అని ఆదేశించాడు. దానితో హనుమంతుడు వచ్చి తన ప్రభువు యొక్క చరణకమలాలపై వ్రాలిపోయాడు. విశ్వామిత్రుని దయాళుత్వానికై అతనికి ప్రణమిల్లినాడు. విశ్వామిత్రుడు అత్యంత ప్రసన్నుడై హనుమంతుని ఆశీర్వదించాడు. అతడు శ్రీరామునితో హనుమంతుని అనన్య భక్తిని గురించి విశేషంగా ప్రశంసించాడు.

హనుమంతుడు సంకట స్థితిలో ఉండగా నారద దేవర్షి ప్రప్రథమంగా అతనికి ఈ మంత్రాన్ని ఉపదేశించాడు. కనుక పాఠక మహాశయులారా! భవాగ్నిదగ్ధులైన వారి విముక్తికై ఈ మంత్రాన్ని జపించాలి. 'శ్రీరామ' - యీ సంబోధన శ్రీరామునికై పిలుపు 'జయరామ' ఇది అతని స్తుతి. 'జయజయరామ' - ఇది అతని విషయంలో పరిపూర్ణ సమర్పణ. మంత్రాన్ని జపించే సమయంలో ఈ భావాలే ఉండాలి. ఓ రామా! నేను నిన్ను స్తుతిస్తున్నాను. నీ శరణు జొచ్చినాను అనండి. మీకు శీఘ్రమే శ్రీరామ భగవద్దర్శనం జరుగుతుంది. సమర్థ రామదాసస్వామి ఈ మంత్రాన్ని 13 కోట్లు జపించాడు. శ్రీరాముని ప్రత్యక్ష దర్శనాన్ని పొందాడు. రామనామం యొక్క అచింత్యశక్తి ప్రభావం అమితమైనది. మీరు రామనామ గుణాలను గానం చేయండి. మీరు మంత్రాన్ని జపించవచ్చు. ఈ మంత్రంలో పదమూడు అక్షరాలున్నాయి. అక్షర లక్షల జపవిధాన మున్నది. ఉపర్యుక్తి త్రయోదశాక్షర మంత్రాన్ని మీరేల జపించరు? దీని వలన ఎందరికో భగవత్ప్రాప్తి కలిగింది. అటులనే మీరు కూడ భగవంతుని ఏల పొందరు? ఈ నామం మీ జీవనానికి సహకారమగును గాక? ఈ నామం మిమ్ము రక్షించునుగాక! సంపూర్ణ శ్రద్ధా భక్తులతో భగవన్నామ అఖండజపంవల్ల మీకు ఈజన్మలోనే ప్రభు సాక్షాత్కారం కలుగును గాక! ఇదే దైవాదేశ ఆశీర్వచన ప్రేరణలు.

## విజ్ఞానవాణి - 2 మిణుగురు పురుగు కాంతికి కారణం ఏమిటి?

వేసవిలో సాయంత్ర సమయాలు, రాత్రుల యందు ముఖ్యంగా వర్షాకాలం మొదలయ్యేరోజుల్లో ఈ మిణుగురు పురుగులు తమకున్న చిన్న చిన్న లైట్లను వెలిగించుకుంటూ ఆర్పేసుకుంటూ అటు ఇటూ తిరుగుతూ వుంటాయి.

మిణుగురు పురుగు దాని కడుపు దిగువభాగంలో వుండే ప్రత్యేక అవయవాల నుండి పసుపురంగు కాంతిని విడుదల చేస్తూ ఉంటుంది. ఈ అవయావాల్లో 'లూసిఫెరిన్' అనే రసాయనం వుంటుంది. ఈ లూసిఫెరిన్ ఆక్సిజన్‌తో కలిసిందంటే ఆక్సీకరణం చెంది మెరుపుల్లా కాంతిని విడుదల చేస్తుంది. ఈ రసాయనచర్యలో ఉష్ణం కూడా విడుదలవుతుంది. కాంతిని పుట్టించే అవయవాల్లో 'లూసిఫెరినేజ్' అనే ఎంజైమ్ ఉంటుంది. ఇది రసాయన చర్యను ప్రేరేపించే ఉత్ప్రేరకంగా పనిచేస్తుంది. చుట్టూ ఉండే గాలిలోని ఆక్సిజన్‌ను తీసుకుంటుంది. కాంతిని పుట్టించే అవయవాల్లోకి గాలిని ప్రవేశింపజేసుకో గల్గుతుంది.

ఈ అవయవాల్లోకి గాలిని తను అదుపుచేస్తూ ఉండడం వల్ల ఈ పురుగు తదనుగుణంగా కాంతిని మిణుగురులుగా బహిర్గతం చేయగల్గుతుంది. ఈ మిణుగురులను లయబద్ధంగా ఏర్పరుస్తుంది. ఒక్కొక్క జాతికి ఒక్కొక్క రకమైన లయతో కాంతిని మిణుగురులు ప్రదర్శిస్తాయి.

- సి.వి. సర్వేశ్వర శర్మ

# క్రోధం....

చెడిపోయే కాలం దాపురిస్తే, మంచి మాటలు చెప్పినా మనిషి చెవికెక్కదు. అలాంటి మనిషి మంచి పనిని చూడడు. మంచి పలుకులు వినడు. మంచి మాటలు మాట్లాడడు. అలాగే అధికారం, అహంభావం, ఆగ్రహం, ఆవేశం వంటి దుర్లక్షణాలు మనిషిని ఆవహిస్తే, ఆతడు కళ్ళుండే అంధుడౌతాడు. చెవులుండీ బధిరుడవుతాడు. అలాంటి సమయంలో ఆతని మంచికోరి, సదుద్దేశంతో, ఎంతటివాడు సలహాయిచ్చినా ఆతడు లక్ష్యపెట్టడు. తద్వారా వివేకాన్ని, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని కోల్పోతాడు. తత్ఫలితంగా, తానెన్నడూ చేయనట్టి, చేయరానట్టి దుష్కృత్యాలను సైతం చేయడానికి వెనుకాడడు. తన్మూలంగా తనపతనానికే కాకుండా, తనవారందరి క్షయానికి కూడా, కారణభూతుడౌతాడు.

"క్రోధాద్భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి"

కోపం వల్ల అవివేకమావహించును. అవివేకం వల్ల మతి భ్రమించును. దాని వల్ల బుద్ధి నశించును. బుద్ధి నశించినచో సమస్తము హతమగును. భగవద్గీతలోని ఈ శ్లోకం తనకత్యంత ప్రీతి పాత్రమని గాంధీగారు ఆయన ఆత్మకథలో వ్రాసుకున్నారు. రావణుడు పండితుడు. అమిత శక్తిమంతుడు. నిష్టాగరిష్టుడు. కాని అహంభావి. సద్విషయమైనా తనకు నచ్చనిచో మెచ్చడు! అందుకే పరాక్రమవంతుడైన రామునితో వైరము తగదని తమ్ముడు విభీషణుడెంతగా వారించినా వినలేదు.

వానర శ్రేష్టుడు హనుమంతుడు ఒంటరిగా వచ్చి లంకాపురిని ధ్వంసము గావించినపుడు భయపడని రాక్షసుడు లేడు. కాని రావణుని మదిలో భయానికి బదులు, రామునిపై క్రోధము, శత్రుత్వము మరింతగా పెరిగాయి. దీనికి తోడు చుట్టూ చేరిన వందిమాగధులు సత్సలహాలకు బదులు, ఆతనిలోని అహంభావం, అంతకు పదింతలు పెరిగేలా పొగడ్తలు చేశారు. అందుచేతనే సీతాదేవిని రాముని కప్పగించే ప్రసక్తే లేదని తెగేసి చెప్పాడు!

లంకా దహనానంతరం, రాక్షస వీరులందరిని సమావేశపర్చాడు రావణుడు. కించిదవమాన భారంతోనే తలవంచుకొని, వారందరికేసి చూశాడు. "వీరులారా! ఇంతవరకు అసాధ్యమైన లంకాపుర ప్రవేశము ఒక సామాన్య కోతికి సాధ్యమైంది. అంతేకాదు. పట్టణమంతా అల్లకల్లోలమై పోయింది. రాక్షస వీరులెందరో మృతి చెందారు. ఇప్పుడు మనమేమి చేయవలెనో మీరందరూ చక్కగా ఆలోచించి చెప్పండి. రాముడు మహాబలవంతుడు. వానర వీరులతో మనపై యుద్ధానికి వస్తాడు. అప్పుడు మన లంకా పట్టణానికి, మన రాక్షస సైన్యానికి కీడు మూడకుండా క్షేమంగా ఉండే ఉపాయం ఆలోచించి చెప్పండి!" ఆ విధంగా రావణాసురుడు అడిగినదే తడవుగా వారంతా ఆయన ఘనత గూర్చి ప్రశంసించసాగారు.

## సోమంచి రామం

"రాజా! వివిధ ఆయుధాలతో మనకు గొప్ప సైన్యముంది ఇంకా దిగులెందుకు? యుద్ధములో కుబేరుని జయించి పుష్పకవిమానాన్ని కైలాస శిఖరమునుంచి దెచ్చుకొన్నవాడివి, నీకు భయమేమిటి! వాసుకి, తక్షకుడు, శంఖుడు యిత్యాది నాగారాజులను జయించినవాడివి! నీవు శత్రుసంహారకుడవు! యముడంతటి వాణ్ణి జయించిన వాడవు! ఇంతెందుకు? ఇంద్రజిత్తును వదిలిపెట్టేచాలు. అతడు రామునితో సహా వానర సైన్యం మొత్తాన్నీ మట్టుపెట్టి వస్తాడు" ఈ లోగా రాక్షస వీరులొక్కొక్కరు లేచి అనుమతిస్తే క్షణంలో పోయి రామ,లక్ష్మణ, సుగ్రీవులను, హనుమంతుని చంపి తిరిగి వస్తామని ప్రగల్భాలు పలికారు. అప్పుడు విభీషణుడు లేచి వారందరని శాంతపరచి అన్నగార్కి వినయపూర్వకంగా చేతులు జోడించి చెప్పాడు.

"ప్రభూ! నేను నీమేలు కోరిచెప్తున్నాను. రాముని శరాఘాతములు నిన్ను హతమార్చక ముందే సీతాదేవిని ఆ పరాక్రమవంతునికి అప్పగించు. రామునిపై క్రోధము పెంచుకోవలదు. క్రోధమువలన ధర్మము, సుఖమూ నాశనమైపోతాయి. అందువలన క్రోధమును విడిచి పెట్టు! ధర్మాన్ని భజించు! నీకీర్తి అధికమవుతుంది. మనమందరం హాయిగా బ్రతికి ఉందాం! ఈ మాటలు రుచించని రావణుడు యుద్ధాన్నే కోరుకొన్నాడు. ఫలితం అనుభవించాడు.



# పదేళ్ళ బాలమేధావి కళ్యాణ రామస్వరూప్

పదేళ్ళ బాలమేధావి ఉద్దండులైన సంస్కృత పండితులు, తెలుగు పండితులు భగవద్గీతపై అడిగే ప్రశ్నలకు అలవోకగా సమాధానాలు చెబుతూ పండిత పామరులను ఆశ్చర్య చకితులను చేస్తున్నాడు. ఎనిమిది మంది పృచ్ఛకులు ఇచ్చే సమస్యలను వెంటనే విప్పుతూ బాలకిషోర్ గుదిమెళ్ళ కళ్యాణ రామస్వరూప్ ఎంతో సమర్థ వంతంగా "భగవద్గీతావధానం" నిర్వహిస్తున్నాడు. రాష్ట్రం లోని ప్రముఖ సాహితీ సాంస్కృతిక సంస్థలు ఈ బాల మేధావిని ఆహ్వానించి సత్కరిస్తున్నారు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు బాల్యంలోనే తన ప్రతిభా పాటవాలను ప్రదర్శిస్తూ బాలమేధావి కళ్యాణ రామస్వరూప్ పలువురి ప్రశంసలనందుకుంటున్నాడు. ఖమ్మం జిల్లా ఏన్కూరు ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయంలో సంస్కృత పండితునిగా పనిచేస్తున్న గుదిమెళ్ళ వెంకట రాఘవాచార్యులు, విజయలక్ష్మి దంపతుల ముద్దుల కుమారుడయిన కళ్యాణ రామ స్వరూప్ తన ఐదవ యేటనే జగిత్యాల ఆర్యవైశ్య సంఘం వారు 1994లో రాష్ట్ర స్థాయిలో 'భక్తియోగం' పై నిర్వహించిన పోటీలలో ప్రథమ బహుమతి గెల్చుకున్నాడు. విశ్వహిందూ పరిషత్ ఆధ్వర్యంలో 1996లో 'సాంఖ్యయోగం'పై నిర్వహించిన పోటీలలో ప్రథమ బహుమతినందుకున్నాడు. 1998లో విజయవాడలో చిన్మయగీత పోటీలలో కళ్యాణ రామ స్వరూప్ వెయ్యి రూపాయలుగా మొదటి బహుమతి నందుకున్నాడు. 1999లో భద్రాచలంలోని శ్రీరామచంద్ర స్వామి వారి దేవస్థానంలో తన 21వ 'భగవద్గీతావధానం' నిర్వహించి పలువురు పండితుల ప్రశంసలనందుకున్నాడు. మచిలీపట్నం టౌన్‌హాలులో భారతీయ సాహిత్య పరిషత్ ఆధ్వర్యంలో 1999లో నిర్వహించిన భగవద్గీతావధానం మచిలీపట్నంలోని సాహితీ ప్రియులను అలరించింది. ఢిల్లీలో ఆంధ్రభవన్‌లో అవధాని నిర్వహించిన అవధానం పలువురిని ముగ్ధులను చేసింది. ఇలా దేశంలో వివిధ ప్రాంతాల్లో అవధానాలు చేసిన అవధాని తన తాత తండ్రులు జన్మించిన గూడూరు గ్రామంలో 2000 మార్చి 30వ తేదీన 'భగవద్గీతావధానం' చేసి పలువురి ప్రశంసల నందుకున్నాడు. లక్ష్మీ నరసింహస్వామివారి దేవస్థానంలో నిర్వహించిన ఈ అవధాన కార్యక్రమానికి సీతారామచంద్ర స్వామివారి దేవస్థానం (భద్రాచలం) ఆస్థాన వేదపండితులు శ్రీ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులు అధ్యక్షులుగా ఉండి కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ అవధానానికి డాక్టర్ బి. ధన్వంతరీ ఆచార్య సంచాలకులుగా వ్యవహరించారు. ముఖ్య అతిథిగా 'శ్రీవాణి' పత్రికా సంపాదకులు

**ముదిగొండ శాస్త్రి**

శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు ఈ కార్యక్రమంలో పాల్గొని ప్రసంగించారు. భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు ఇటువంటి కార్యక్రమాలవల్ల మరొక్క మారు ప్రజలకు వివరించవచ్చని అన్నారు. ఈ అవధానం పిల్లల్లో భగవద్గీతపై పరనాశక్తిని పెంపొందింప చేస్తుందని అన్నారు.

ఈ అవధానంలో కె.వై.ఎల్. నరసింహం 'ధారణ' అంశాన్ని చేబట్టారు. పృచ్ఛకుడు నరసింహం (కళాసాగర్) 18 అధ్యాయాల్లో శ్లోక ప్రారంభం చెప్పగానే అవధాని వెంటనే ఆ శ్లోకాలను చదివి వినిపించారు. శ్రీ తాండవ కృష్ణ 'సంఖ్యాగణనం' అంశాన్ని చేబట్టారు. నాల్గవ అధ్యాయంలో 8వ శ్లోకం, 17వ అధ్యాయంలో మూడవ శ్లోకం చెప్పమని అడిగారు. అదే విధంగా కొన్ని శ్లోకములను చెపితే ఆ శ్లోకములు ఏ అధ్యాయంలో ఎన్నవ శ్లోకమో చెప్పాడు. ఆంధ్ర సారస్వతి సమితి కార్యదర్శి జిసనారా 'పాదపూరణ' అంశాన్ని చేబట్టారు. జిసనారా మధ్యపాదాలు, చివరిపాదాలు చెప్పగా అవధాని ఆ శ్లోకాన్నంతా చదివి వినిపించారు. శ్రీ చింతలపాటి మురళీకృష్ణ 'అంత్యాక్షరి' అంశాన్ని నిర్వహించారు. భారతీయ సాహిత్య పరిషత్ చల్లపల్లి శాఖ కన్వీనర్‌గా ఉంటున్న మురళీకృష్ణ కొన్ని పద్యాలు శ్లోకాలు చదవగా ఆ శ్లోకాల చివరి అక్షరంతో ప్రారంభమయ్యే గీతా

శ్లోకాలను ధారణచేశారు 'డ'తో ఉన్న ఒక పద్యం పాడగా అవధాని 'డ'తో ప్రారంభమయ్యే శ్లోకాలు లేవని సభ్యులను ఆశ్చర్య చకితులను చేశారు. 'అకారాది గణనం' అంశాన్ని శ్రీమతి వేదాల జానకి నిర్వహించారు. శ్రీమతి జానకి కోరిన అక్షరంతో ప్రారంభమయ్యే శ్లోకాలు భగవద్గీతలో ఎన్ని ఉన్నాయో అవధాని చెప్పారు. భారతీయ సాహిత్య పరిషత్ కార్యదర్శి శ్రీ కారుమూరి రాజేంద్రప్రసాద్ 'అక్షరదర్శనం' అంశాన్ని నిర్వహించారు. పృచ్ఛకులు రాజేంద్రప్రసాద్ ఒక రౌండ్‌లో 15వ అధ్యాయం 14వ శ్లోకం, రెండవ పాదం మూడవ అక్షరం ఏమిటని అవధానిని ప్రశ్నించగా వెంటనే 'యం' అని చెప్పగా ప్రేక్షకులు కరతాళధ్వనులతో అభినందించారు. 'న్యస్తాక్షరి' అంశాన్ని కె.వి.రంగనాథబాబు (అవనిగడ్డ) నిర్వహించారు.

ఒక శ్లోకంలోని పాదంలో ఒక్కొక్క అక్షరం రంగనాథ బాబుకు ఇస్తూవచ్చారు. ఇలా ఏడు అక్షరాలు క్రమ రహితంగా ఇచ్చారు. ఎనిమిదవ అక్షరం ఇవ్వక ముందే అవధాని ఆ శ్లోక పాదాన్ని చెప్పి ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేశారు. విద్వాన్ ముదిగొండ శాస్త్రి కొన్ని శ్లోకాలు పాడి వాటికి భావం చెప్పమని అవధానిని కోరారు. అవధాని ఆ శ్లోకాలకు చక్కగా భావం చెప్పారు. అతిథులకు కాజ జిల్లాపరిషత్ హైస్కూలు తెలుగుపండితులు శ్రీ టి.వి.ఆర్. ఆర్. ఆచార్యులు స్వాగతం పలికారు. గూడూరు గ్రామ పెద్దలు, ఆలయ ఇ.ఓ. రాములు అవధానిని సత్కరించారు. ఆంధ్రసారస్వత సమితి పక్షాన అవధానికి రూ 550/-ల ప్రతిభా పురస్కారం అందివ్వడం ఈ కార్యక్రమంలో విశేషం. భారతీయులు ఎంతో గర్వంగా చెప్పుకునే 'భగవద్గీత'లో ఈ బాలమేధావి అవధానం చేస్తూ మరింత అభివృద్ధిని సాధిస్తాడని ఆశిద్దాం. ●



# పురుష సూక్తము 11

*తస్మాదశ్వా అజాయంత*
*యే కే చోభయాదతః*
*గావోహ జజ్ఞిరే తస్మాత్*
*తస్మాజ్జాత అజావయః*

**అర్థం :**

**తస్మాత్** : ఆ యజ్ఞం వలన
**అశ్వా** : వేగవంతమైన గుర్రాలు మొదలైనవి
**అజాయంత** : పుట్టాయి
**ఉభయాదత** : రెండు దౌడలు, దంతాలుగల జంతువులు పుట్టాయి
**తస్మాత్** : ఆ యజ్ఞంవలన
**గావః** : గోజాతి పశువులు
**జజ్ఞిరే** : పుట్టాయి
**తస్మాత్** : ఆ యజ్ఞం వలన
**అజావయ** : మేషజాతి పశువులు జంతువులు
**జాతా** : పుట్టుక వచ్చాయి

**వ్యాఖ్య :**

'సర్వహుత' యజ్ఞఫలంగా అశ్వజాతులు ఉపజాతులు గార్ధభాదులు గోజాతులు ఉపజాతులు మహిషాదులు మేషజాతులు ఉపజాతులు గొఱ్ఱెలు జన్మించాయి.

కామక్రోధాదులు మిక్కిలిగా గలవి పశుసంతతులు. వాయవ్యాలు వాయువునుండి జనించినవి. వివిధ మారుతాలు. అందు చరించు జీవులు కూడా అంత రార్థాలు అవలోకించు ఆరణ్యకాలు అరణి నుండి జనించిన అగ్ని సంబంధితాలు. గ్రామం అంటే సమూహం గ్రామ్యాలు గుంపులు గుంపులుగా పుట్టిన క్రిమికీటకాదులు పశువులు పక్షులు అశ్వాలు వేగానికి అధిష్ఠాన భూతులైన అశ్వినీ దేవతాంశాలు. ఉభయాదతాలు అంటే అహో రాత్రాలు.

గావ : అంటే సూర్యగ్రహాది గమనకక్ష్యలు.

అజ : అంటే పుట్టుక లేనివి సుస్థిర ధర్మ ప్రజ్ఞలు.

అవయ : అంటే గొఱ్ఱెలు కాలచక్రంలోని ఆరంభ రూపాలు అశ్వాలు గోవులు మేషాలు అది అన్నీ రాశి చక్ర చిహ్నాలు. అవి సంవత్సర ఋతుధర్మాలను ప్రవర్తనం చేస్తాయి. ఆయా ఋతువులలో ఆ జంతు రూపాలలో జీవుడు యజ్ఞచక్రంలో గమనం చేస్తుంటాడు.

- జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

శ్రీ రామనవమి సందేశం

# రోమ రోమం రామ నామం



"దానము కాని యజ్ఞసముదాయము కాని
సన్మానము కాని జీవిత విధానము కాని
సనాతన ధర్మము కాని విజ్ఞానము కాని
మరి ఏదైనను కాని ప్రేమకు సరితూగదు
విచారణ చేసి చూచినన్......"

ప్రేమస్వరూపులారా!

రామాయణం ఎరుగని మానవుడు భారతదేశములో లేడు. ప్రతి కుటుంబం యొక్క ఆదర్శము రామాయణమే. ప్రాచీనకాలమునుండి రామచరిత్రను గురించి అనేక స్థానములయందు, అనేక పర్యాయములు విన్నటువంటివారి కోకొల్లలు. అయితే మానవులుగా పెరుగుతున్నారేగాని, మానవత్వాన్ని గురించి ఏమాత్రం విచారించటంలేదు. మానవుడు అభివృద్ధిగాంచుతున్నాడేగాని, మానవుని మనస్సు ఏమాత్రం అభివృద్ధి గాంచటంలేదు. మానవుడు గుడ్డలు మార్చుతున్నాడేగాని బుద్ధులు మారటంలేదు. మనసు మారక మనిషివుండి ప్రయోజనం ఏమిటి? బుద్ధులు మారక గుడ్డలు మార్చినందువలన లాభమేమిటి? మనసులు మారాలి. మనిషి మారినంత మాత్రమున ఏమాత్రం ఫలితముండదు. మనసు మారకుండా ఎన్ని సాధనలు చేసినా ప్రయోజనముండదు. ఎన్ని తీర్థయాత్రలు సేవించినా, మనసు మారనప్పుడు ఏమి ప్రయోజనం?

ఆధ్యాత్మికమునందు ప్రధానమైన సత్యమేదో గుర్తించడానికి ఈనాడు మానవుడు తగిన ప్రయత్నం చేయటం లేదు. "మనోమూలం ఇదంజగత్" జగత్తంతా వ్యాపించినటువంటిది మనసే. అట్టి ముఖ్యమైన మనస్సును మార్చుకోకుండా ఎన్నిమార్చినా ఏమి ప్రయోజనం? మానవుడు పుట్టుక తోనే మూడుఋణములతో వస్తున్నాడు. 1. **దైవఋణము 2.ఋషిఋణము 3. పితృఋణము.** ప్రాచీనకాలము నుండి భగవంతుడు మానవుని దేహములోని ప్రతి అణువునందువుంటూ మానవత్వాన్ని పోషిస్తూ, మానవత్వాన్ని నడిపిస్తూ వస్తున్నాడు. అతనిపేరే 'అంగీరస' భగవంతుడు మానవుని ప్రతి అంగమునందునూ రసస్వరూపుడైవుంటూ క్షణక్షణమూ మానవుడిని కాపాడుతూ వస్తున్నాడు. భగవంతుడు ఈ విధంగా రక్షిస్తూ రావటం చేతనే మనం భగవంతునికి ఋణపడివున్నాము. ఈ ఋణమును మానవుడు ఏరీతిగా తీర్చుకోవాలి? తన శక్తికొలది సత్కర్మలు, సదాచారముల ద్వారా ప్రక్కవాడికి సహకారం అందించి, వానిబాధలు నివారించి పరులక్షేమాన్ని కోరినప్పుడే భగవంతుని ఋణమును తీర్చుకొనినవారమవు

## భగవాన్ సాయి సుబోధ

తాము. కనుక భగవంతుని ఋణమును తీర్చుకొనే నిమిత్తమై మానవునికి సేవలు అనేటటువంటిదానిని అందించాడు భగవంతుడు. ఎవరికి సేవలు చేయాలి? ప్రాణులకు సేవలు చేయాలి. ఈ సేవలు దేని నిమిత్తమై చేస్తున్నారు? తమ ఋణవిముక్తిని గావించుకొనే నిమిత్తమై చేస్తున్నారుగాని, ప్రాణులయొక్క సహాయనిమిత్తమై కాదు. ఏ సేవలు చేసినా తమ ఋణములో కొంత తగ్గిపోతుంది. కనుక మానవుడు కర్మాచరణ చేత తన యొక్క దైవ ఋణమును తీర్చుకొనుటకు తగిన కృషిచేయాలి. ఏ కించిత్ సహాయం ఇతరులకు చేసినా, ఇందులో దైవ ఋణము కొంతవరకు తగ్గిపోతుంది, దేహము నిచ్చింది **పరులకు సేవచేయడానికేగాని, నాయకుడుగా వుండే నిమిత్తమై కాదు. సేవకుడే నిజమైన నాయకుడు.** అట్టి సేవలు చేసి దైవఋణమును తీర్చుకొని తాను ధన్యుడు కావాలి.

రెండవది ఋషి ఋణము. ప్రాచీనఋషులు మానవుని యొక్క భూతభవిష్యత్తు వర్తమానములను గురించి, సత్సంప్రదాయములను గురించి, అనేక ధర్మములను, నీతులను సరియైన మార్గంలో ప్రబోధిస్తూ వచ్చారు. ఇహపరములలో తరించే నిమిత్తమై ఋషులు అనేక విధములైన సాధనలు కలిపించారు మానవులకు. కనుక ఋషులు నిర్దేశించిన మార్గములను తూ.చా. తప్పకుండా అనుసరించి ఆ ఋషుల ఋణమును మనం తీర్చుకోవాలి.

మూడవది మాతాపితృఋణము. కనిపెంచి విద్యా బుద్ధులు నేర్పించి పిల్లలను అనేక విధముల అభివృద్ధిలోనికి తీసుకొని వస్తుంటారు తల్లితండ్రులు. పిల్లలకు మొట్టమొదటి గురువులు, తల్లిదండ్రులే. కనుకనే వేదములు మాతృదేవోభవ! పితృదేవోభవ! అని బోధించాయి. కనుక తల్లితండ్రులను బాధించకూడదు. వారిని ప్రేమించాలి, పూజించాలి, ఆరాధించాలి. మన సేవల ద్వారా వారి ఋణమును తీర్చుకోవాలి.

ఇట్టి మూడు ఋణములను తీర్చుకొనే నిమిత్తమై మానవుడు జన్మించాడుగాని, ధనకనక వస్తువాహనాదులను అభివృద్ధిగావించుకొని, లౌకిక సుఖములను అనుభవించి, జీవితమును వ్యర్థంగావించుకోవటానికి కాదు. అయితే ఈనాటి ఆధునిక యుగంలో భక్తులం....భక్తులం... అని చెప్పుకుంటూ దీనికి విరుద్ధమైన మార్గంలో నడుస్తున్నారు.

ఈనాడు రాముని జన్మదినం, జన్మదినములు చేసుకోవటం గొప్పకాదు. జన్మించిన మహనీయులు బోధించిన బోధనలు ఆచరణలో పెట్టటం గొప్పతనం. "రామోవిగ్రహవాన్ ధర్మః" అన్నారు. అతని స్వరూపమే ధర్మస్వరూపము. అతని వాక్కే సత్యస్వరూపము అతని ఆచరణయే శాంతి స్వరూపము. దీనికంటే మించినది మరొకటి ఉన్నదా?

"సర్వభూత ధరం శాంతం
సర్వనామ ధరం శివం
సచ్చిదానంద రూపం అద్వైతం
సత్యం శివం సుందరం"

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు సామాన్యమైనటువంటి దశరథకుమారులు కాదు. అసలు ఈ దశరథుడు ఎవరు? భౌతికంగా తీసుకుంటే అయోధ్యరాజు. అసలు అయోధ్య అంటే ఏమిటి? కాశీకి సమీపమున వున్నది 'అయోధ్య' అని అంటున్నారు. అక్కడనే శ్రీరాముడు పుట్టాడని భావిస్తున్నారు. ఇదికాదు. ఒకసారి అశోక్‌సింఘాల్ "శ్రీరాముని జన్మస్థానం ఎక్కడ" అని నన్ను అడిగాడు. అప్పుడు నేను "రాముడి జన్మస్థానం కౌసల్యాగర్భము" అన్నాను. ఆకారాన్ని చూచి రాముడు ఇక్కడ, అక్కడ పుట్టాడని నిర్ణయిస్తున్నారుగాని రాముడు సర్వవ్యాపకుడు. అయోధ్య అనేది ఎక్కడ? ఎవ్వరూ అందులో ప్రవేశించడానికి వీలులేనిదే అయోధ్య, అదియే హృదయము. ఆ హృదయమును సాకారముగా తీసుకున్నటువంటివాడే దశరథుడు. దశేంద్రియములకు రథమైనటువంటిది ఈ దేహము. అతనే దశరథుడు. ఇతనికి కౌసల్య, సుమిత్ర, కైకేయి ముగ్గురు భార్యలు. ఈ ముగ్గురు భార్యలనగా ఏమిటి? ముగ్గురిని వరించినటువంటి వాడు. ఈ దేహాధారమైనటువంటి ప్రతిమానవుడు కూడనూ సత్వరజోతమో గుణములను వరిస్తుంటాడు. ఆ త్రిగుణముల పేర్లే కౌసల్య, సుమిత్ర, కైకేయిలు. సాత్వికగుణము కౌసల్య, తామసిక గుణమే సుమిత్ర, రజోగుణము యొక్క స్వరూపమే కైక. ఈ ముగ్గురికి నల్గురు బిడ్డలు పుట్టారు. ఈ నల్గురు చతుర్వేదములు. ఋగ్వేదమే శ్రీరాముడు. సామవేదమే భరతుడు. యజుర్వేదమే లక్ష్మణుడు. అధర్వణవేదమే శత్రుఘ్నుడు, నాల్గువేదములు పిల్లలుగా పుట్టి దశరథుని ఇంట్లో ఆడుకుంటున్నారు. ఇలాంటి పవిత్రమైన భావములను ఆధారముగా తీసుకొనినప్పుడే, మనం నిజమైనటువంటి భక్తి ప్రపత్తులను గుర్తించిన వారమవుతాం.

కౌసల్య అనగా మంచి పవిత్రురాలైన స్థిరచిత్తురాలు. సుమిత్ర అనగా మంచిమిత్రుడు. ఆమెకువున్న ఆదర్శం మరెవ్వరికీ లేదు. రాముడు అరణ్యానికి వెళ్ళుతుంటే కౌసల్య విలపిస్తుంది. కాని సుమిత్ర మాత్రం ఓదార్చి ధైర్యం చెబుతుంది. లక్ష్మణునికి నీతులు బోధించి రాముని వెంట పంపుతుంది. ధర్మసూక్ష్మము తెలిసిన ఆదర్శ మాతృమూర్తి సుమిత్ర. రాముని అంశము లక్ష్మణుడు, భరతుని అంశము శత్రుఘ్నుడు. అందువలననే అంతవరకూ ఏడుస్తున్న లక్ష్మణుడు (శిశువు) రాముని తొట్టెలో పడుకోపెట్టేటప్పటికి ఏడ్వడం మానివేశాడు. అదేవిధంగా శత్రుఘ్నుని (శిశువు) భరతుని తొట్టెలో పడుకోపెట్టేటప్పటికి ఏడ్వడం మానివేశాడు. ఏఏ అంశం, ఆయా అంశములలో చేరేటప్పటికి పరిపూర్ణ ఆనందమును పొందుతారు. కనుక మనం కూడా భగవత్ సన్నిధికి చేరినప్పుడే మనల్ని బాధలు ఏమాత్రం బాధించవు. ఆనందాన్ని పొందుతాము. లక్ష్మణుడు నిరంతరం రామసేవలోనే నిమగ్నుడైపోయినాడు. శత్రుఘ్నుడు తన జీవితమంతా భరతుని తోనే గడిపాడు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులవంటి సోదరులు ఈ జగత్తులో కానరారు.

## సుభాషితవాణి

"కృషిలో నాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకమ్
మౌనేన కలహో నాస్తి
నాస్తి జాగరతో భయమ్."

కృషి చేసేవాడికి కఱువనేదేలేదు. జపం చేసుకునేవాడి పాపమంటూ లేదు. మౌనంగా ఉండేవానికి కలహభయము ఉండదు. జాగ్రత్తగా ఉండేవానికి అసలు భయమేలేదు.

ఎవరికైనా కవలలు పుట్టేటప్పటికి రామలక్ష్మణ అని పేరే పెట్టుకుంటారు మన భారతీయులు. కాని 'రామలక్ష్మణ' అని పేరు పెట్టుకుంటారు గాని ఆస్తి కోసం సుప్రీంకోర్టు వరకు వెళ్ళుతారు. కాని రామాయణంలోని రామ లక్ష్మణులు మాత్రం సుప్రీంస్టేట్‌కు రీచ్ అయినారు. అంత ఐకమత్యమును ప్రదర్శించారు.

ఒక పర్యాయం యుద్ధభూమిలో రామలక్ష్మణులిద్దరూ ఒకే పర్యాయం నాగపాశబద్ధులై మూర్ఛిల్లుతారు. వారిద్దరి లో రామునికి ముందుగా తెలివివస్తుంది. లక్ష్మణుని శిరస్సు తన తొడపైన పెట్టుకొని రాముడు విలపిస్తూ "లక్ష్మణా! నేను ప్రయత్నిస్తే సీతవంటి భార్య అయినా నాకు చిక్కగలదు. కాని లక్ష్మణుని వంటి సోదరుడు మాత్రం నాకు యింకా చిక్కడు" అని అంటాడు. లక్ష్మణుని పైన అంతటి ప్రేమకలిగినటువంటి వాడు రాముడు. వారి ప్రేమ తత్త్వమును చక్కగా విచారిస్తే ఎంతటి ఆదర్శమైనటు వంటిదో, మనకు చక్కగా బోధపడుతుంది.

కనుక ఇటువంటి ఆదర్శములను మనం తీసుకోవాలి కాని, రాముడు పుట్టాడు. అరణ్యాలకు వెళ్ళాడు, లంకకు చేరాడు, రావణుని సంహరించాడు, సీతను తెచ్చాడు. అది కాదు. ఏకర్మ ఎప్పుడు? ఎక్కడ? ఏవిధంగా చేశాడు? దానిని తెలుసుకొని మానవత్వాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి. రాముడు దేనికోసం పుట్టాడు? ధర్మసంస్థాపన కోసం పుట్టాడు. కనుక మనము ఆ ధర్మాన్ని ఏవిధంగా కాపాడాలి? దానిని తెలుసుకొని మనం బాధ్యతలను నిర్వర్తించాలి. ధర్మమంటే ఏమిటి? 'ధారయతీతి ధర్మః' ప్రతి మానవుడు ధర్మాచరణ నిమిత్తమై పుట్టినవాడే. కనుక మనం ధర్మమును అనుసరించాలి, ఆచరించాలి. "పితృ వాక్య పరిపాలనమే ధర్మం" అన్నాడు శ్రీరాముడు. తండ్రి ఆజ్ఞానుసారం అరణ్యాలకు బయలుదేరాడు. నేనూ కూడా వస్తానన్నది సీత. అక్కడ అనేక క్రూరమృగాలు వుంటాయి. రాక్షసులు ఉంటారు, వద్దన్నాడు శ్రీరాముడు. అప్పుడు పతిని అనుసరించటమే సతి ధర్మమన్నది సీత. సీత సామాన్యురాలు కాదు. ఆమె భూజాత, భూమి యందున్న సర్వశక్తులు ఆమెయందున్నాయి. అయోధ్య లోనే వుండి అత్తమామలకు సేవ చేస్తుండమని చెప్పాడు శ్రీరాముడు. అత్తమామలకన్నా భర్తకు సేవచేయుటమే నా ప్రధాన కర్తవ్యమన్నది సీత. **"నీవు రామచంద్రుడివి. ప్రకాశించే చల్లని చంద్రుడి వంటివాడవు. నేను సీతను. 'సీత' అనగా శీతలమైనటువంటి వెన్నెలవంటి దానిని. చంద్రుడు ఒక చోట, వెన్నెల ఒకచోట ఉంటుందా? చంద్రుడు అరణ్యం లో, వెన్నెల అయోధ్యలో వుండటానికి వీలవుతుందా? చంద్రుడు ఎక్కడో, వెన్నెల అక్కడనే వుంటుంది".** అని చెప్పి, నేనూ నీతో వస్తానని చెప్పి బయలు దేరింది సీత. ఇట్టి ఆదర్శములను మనం తీసుకోవాలి. ఇట్టి పవిత్రమైన మార్గంలో మనం ప్రవేశించాలి. ఈ విధంగా రామాయణమును చక్కగా పరిశీలించి, ఆచరించాలి.

రామాయణం సామాన్య మానవుని చరిత్రకాదు. దేశము యొక్క చరిత్రయే ఈ రామాయణ చరిత్ర. సుమిత్రకు యిచ్చిన పాయసపు కప్పును డేగ ఎత్తుకొని పోయి, హిమ పర్వతము పైన పెట్టింది. ఆ పాయసపు కప్పు అంజనీ దేవికి చిక్కింది. ఆ పాయసము అంజనీ దేవి త్రాగింది. అందువలన ఆమె గర్భంలో హనుమంతుడు పుట్టాడు. కనుక హనుమంతుడు కూడా ఈ పాయసము యొక్క అంశమే. ఈ విషయం చాలామందికి తెలియదు.

శ్రీరామునికి పట్టాభిషేకం జరుగుతున్నది. ప్రజలు ఆనందంతో పాల్గొంటున్నారు. శ్రీరాముడు అందరికీ బహుమతులు పంచుతున్నాడు. అందరికీ యిచ్చాడుగాని హనుమంతునికి యివ్వలేదు. ఈ విషయం సీత గమనించింది. రాముని అడిగింది. **"సీతా! హనుమంతుడు ఈ బహుమతులతో తృప్తి చెందేటటువంటివాడుకాదు. అతనికి ఏ బహుమానం అవసరంలేదు."** అన్నాడు శ్రీరాముడు. అప్పుడు సీత తన మెడలోవున్న ముత్యాల

హారమును తీసి హనుమంతునికి యిస్తుంది. దానిని మెడలో ధరించక, ఆ హారములోని ఒక్కొక్క ముత్యమును తీసి, కొరికి, చెవిదగ్గర పెట్టుకొని పారవేస్తున్నాడు. సీత ఆశ్చర్యపోతుంది. అట్లా ఎందుకు చేస్తున్నావని హనుమంతుని అడుగుతుంది సీత. "రామనామం వినిపించని రత్నంగాని, ముత్యంగాని నాకు అక్కరలేదు, రామనామం లేనిది రాయితో సమానం" అని చెప్పి ఆ ముత్యాల హారమును పారవేస్తాడు హనుమంతుడు అంత విలువైన హారమును పారవేసినందులకు సీతకు కోపం వస్తుంది. అప్పుడు హనుమంతుడు "క్షమించు! అమ్మా! నాయందు వుండినటు వంటి ఏపదార్థమైనా, అది రామ నామాన్నే స్మరిస్తుంది" అని చెప్పి తన చేతి మీద వున్న వెంట్రుక ఒకదానిని పీకి, సీత చెవి వద్ద వుంచుతాడు. ఆ వెంట్రుకనుంచి రాం...రాం... రాం... అని శబ్దము వినిపిస్తుంది సీతకు. రోమ రోమము రామ నామంతో నిండినటువంటిది హనుమంతుని దేహము హనుమంతుడు సామాన్యమైనటు వంటి 'కోతి' అని భావిస్తుంటాడు. రామయణం పరిపూర్ణ స్వరూపాన్ని పొందటానికి మూలకారణం హనుమంతుడే. కనుక హనుమంతుడే లేకపోతే రామాయణమే లేదు. హనుమంతుడు పరమ పవిత్రుడైన పరిపూర్ణ భక్తి స్వరూపము. ఎక్కడ రామనామం జరుగుతుంటే అక్కడ హనుమంతుడు ప్రత్యక్ష మవుతాడు. నామం, రూపం వేరు కాదు. ఈ రెండింటి యొక్క ఏకత్వమే నిజమైన ఏకత్వాన్ని బోధించింది. ఇదే రామ అద్వైతము. ఇటువంటి పవిత్రమైన భావాలను ఎవరైనా స్మరిస్తున్నారా? ఎన్నిసార్లు రామాయణం పారాయణం చేసినా ఏమి ప్రయోజనం? ఏమైనా బుద్ధులు మారుతున్నాయా? మనసేమైనా మారుతున్నదా? లేదు...లేదు...లేదు.. మనుష్యులు మాత్రం మేము రామ భక్తులం... మేము రామభక్తులం... అంటున్నారు. అసలైన రామభక్తులు మాత్రం ఎక్కడా కనిపించటం లేదు. బాహ్యా మైన ఆడంబరములేగాని, నిజమైన ఆచరణ స్వరూపులైన భక్తులు ఎక్కడా కనిపించటంలేదు. అహంకార ఆడంబరము లను రాముడు మెచ్చడు. ఆచరణ, ఆనందములకే రాముడు దక్కుతాడు. కనుక రామ తత్త్వమును చక్కగా గుర్తించి, వర్తించాలి.

**(శ్రీరామనవమి సందర్భముగా (12-4-2000)న బృందావనం (బెంగుళూరు)లో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగమునుండి)**

## అమ్మ కిడుదు వందనమ్ము నేను

నాకు జన్మనిచ్చి నవమాసములు మోసి
స్తన్యమిచ్చి సాకె శైశవమున
మమత బెంపుజేసె మలమూత్రముల నెత్తి
అమ్మ కిడుదు వందనమ్ము నేను

గోరుముద్ద లిడుచు గారాము చేసెను
చందమామ జూపి శాంతపరచె
చంకనెత్తి త్రిప్పి సరదాలు తీర్చెను
అమ్మ కిడుదు వందనమ్ము నేను

ఉగ్గుపాలు పోసి ఉయ్యాల నూపెను
చిచ్చికొట్టి నిదురపుచ్చె నన్ను
దిష్టిచుక్క దిద్ది దీవెన లందించె
అమ్మ కిడుదు వందనమ్ము నేను

ముద్దుమాట లెన్నొ ఒద్దికగా జెప్పె
నిలువబెట్టి నడక నేర్పె నాకు
ఆకలెరిగి వేళ కన్నము తినిపించె
అమ్మ కిడుదు వందనమ్ము నేను

చిట్టి పొట్టి కతలు చెప్పి మెప్పించెను
ఆట-పాట నేర్పి అలరజేసె
ఒడిని బడిగ జేసి ఓనమాల్ దిద్దించె
అమ్మ కిడుదు వందనమ్ము నేను

అమ్మ చూపులందు అమృతమ్ము తొలకును
అమ్మ పలుకులందు అమృత మొలుకు
అమ్మ చేతలందు అమృతమ్ము జాల్వారు
అమ్మ కిడుదు వందనమ్ము నేను

'అమ్మ' పదము నందు కమ్మదనమ్ముండె
కన్న కడుపు తీపి నెన్న తరమె?
అందరమ్మ లిటులె యుందురుగాక, మా
అమ్మ కిడుదు వందనమ్ము నేను

బాల్యమందు తల్లిపాలు త్రాగనివారు
'అమ్మ' యనుచు పిలువనట్టివారు
అమ్మ ఒడిని ఆటలాడని వారు - జీ
వితమునందు చాల పేదవారు!

హెచ్.ఆర్. చంద్రం, గుడివాడ.

# లీలా విగ్రహరూపము నుండి బహిర్గతమైన శిలావిగ్రహము

ఒకరోజు బాబాగారు భక్తులతో కలిసి చిత్రావతి నదికి వెళ్ళినారు. తేమలేని, ప్రవాహములేని చోటికి చేరినారు. స్వామి మధ్యలో కూర్చొన్నారు. భక్తులందరూ చక్రాకారముగా గుంపుగా చేరినారు. బాబాగారి చుట్టూ కూర్చొన్న భక్తులు భజన పాటలు పాడుచున్నారు. 4,5, భజన పాటలు పాడిన తరువాత కొంతమంది స్వామితో కొన్ని ప్రశ్నలనడిగినారు. కర్మనుండి బంధము, కర్మత్యాగమునుండి మోక్షమని కొందరు చెప్పుదురుకదా స్వామీ.

అప్పుడు బాబాగారు సమర్పణ భావముతో శరణాగతి నొంది, మానసికముగా కర్మచేసిననూ బంధము మనకు చేరదు. ఫలాపేక్ష నుండియే సుఖదుఃఖములు ప్రాప్తమవుతాయి కర్మ, భక్తి, జ్ఞానము - యీ మూడింటి సమన్వయమూ వుండవలెను అని స్వామి ప్రబోధించిరి. ఈ రోజుల్లో వందలాది రకాల షిర్డి బాబాగారి ప్రతిమలు తయారు చేస్తున్నారు. స్వామి, తన పూర్వశరీరము గురించి ప్రస్తావించి పై విధముగా చెప్పుచూ, అవన్నీ అవలక్షణములతో కూడియున్నవి. ఎనామెల్ బొమ్మలుగా కనపడుచున్నవి. నా పూర్వశరీరపు ఆకారము సరిగా ఆ బొమ్మల్లో గోచరించడము లేదు. అని చెప్పుచూ స్వామి, తన ముందున్న యిసుకపైన తన చేతిని త్రిప్పుచూ, తళతళ మెరుస్తూవున్న వొక ఫోటోను సృష్టించి తీసినారు. యీ విధముగా వుండవలెను అని అందరికి చూపిరి. షిర్డిసాయి బాబాగారి విగ్రహాన్ని భక్తిగా పూజించుకొనే ఒక యింజనీరు గార్కి ఆ ఫోటోను అందచేసిరి. మాటల మధ్యలో బాబాగారు దత్తాత్రేయుని అవతార తత్త్వమునూ, సతి అనసూయదేవి మహిమలను గురించి ప్రస్తావించిరి. శివకేశవులు మాత్రమేకాదు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ ఏకమేవాద్వితీయ శక్తి అని వివరిస్తూ, శ్రీవారు యిసుక రాశిపై నుండి జగన్మోహనమైన దత్తాత్రేయ స్వామి విగ్రహాన్ని సృష్టించి అందరికి చూపినారు. ఆ విగ్రహము పంచలోహములతో తయారయినది.

శిల్పశాస్త్ర నియమాలకు అనుకూలముగా తయారు అయినది. అత్యుత్తమమైన ఉజ్జ్వల కళాశోభితమైనది. ఆ విగ్రహాన్ని మరొక భక్తునికి అందచేసిరి.

ఆ రోజుల్లో బాబాగారు జనుల నాకర్షించే మహాపర్వదినములందు నిలయమందు చేరిన భక్తులనందరిని కలిపి చిత్రావతీనదికి తీసుకొని వెళ్ళుచుండిరి. గోకులాష్టమి పర్వదినమందు చిత్రావతీ నదీ తీరమందున్న యిసుక నుండి కృష్ణ విగ్రహమును సృష్టించి తెచ్చి మందిరమందు అందరితో పూజలు చేయించి, చివరికి ఎవరో ధన్యాత్ములయిన భక్తుని కందచేసెడివారు. అదేరీతి శ్రీరామనవమి పర్వదినమందు హనుమత్సమేత సీతారామ లక్ష్మణుల విగ్రహాలను సృష్టించుచుండిరి. కాళహస్తి సమీపాన ప్రవహించు సువర్ణ ముఖీ నది యిసుకనుండి పెద్ద రామ విగ్రహమును సృష్టించి తీసి వెంకటగిరి రాజాగారి కొసంగినారు.

రాజాంతఃపురమునందు యిప్పటికినీ ఆ రామ విగ్రహము పూజలందుకొంటున్నది. నది మధ్యన ఆయా సమయములందు స్వామి చుట్టూ చేరిన భక్తులకు యిసుక నుండి సృష్టించి తీసిన కలకండముక్కలను పంచుచుండిరి. మీకందరికి నోరు తీపి చేస్తున్నాను అని చెప్పుచూ స్వామి స్వయముగా అందరికీ పంచెడివారు. తన దగ్గరగా పడియున్న ఒక పాత పత్రికమీద స్వామి దివ్యహస్తములతో యిసుకను ధారగా పోయుచుండిరి. అదంతా చక్కెరగా మారుచుండెడిది. ఆ ప్రసాదమును అక్కడ చేరిన భక్తులందరికి పంచెడివారు. ఆనాటి భక్తులెంత ధన్యాత్ములో, పుణ్యాలరాసులోనని భావన కలిగినపుడు భగవదానందము కలుగుతుంది.

ఈ వ్యాస మూలము :

**"దివినుండి భువికి దిగివచ్చినదేవుడు"**

కన్నడ మూలము :- ధరెగిళిదదేవరు

మూలము :- కీ॥శే॥ న. కస్తూరి M.A., B L.

సేకరించినవారు :- కె. సరోజమ్మ M.A , B.Ed., బెంగుళూరు.

తెలుగు అనువాదము :-

పంచాంగము శివప్పశాస్త్రి, పుట్టపర్తి

Seminar on Science and Spirituality in Tirupati

# సంస్కారము లేని విజ్ఞానశాస్త్రం కన్నా విజ్ఞానశాస్త్రం లేని సంస్కారమే మిన్న

ఆధ్యాత్మమర్మాలు అలవోకగా తెల్ప
విబుధ వర్గమువారు వింతజూసె
హస్తచాలన చేత వస్తువులు సృష్టింప
భౌతికసూత్రాలు భగ్నమయ్యె
కోట్లాది రూప్యముల్ కొల్లలుగా కురవ
ప్రభుత్వాలకు అంతుపట్టకుండె
వింత రోగాలన్ని విభూతితో పోవ
ప్రముఖ వైద్యులు ప్రణమిల్లుచుండె
ఏది చేసిన అది ఆయె అద్భుతమ్ము
ఏది చెప్పిన అది ధర్మసమ్మతమ్మె
ఏది పల్కిన అది నిత్య సత్యమేను
సాయి ప్రజ్ఞను వర్ణింప సాధ్యమగునె.

"విజ్ఞాన శాస్త్రము - సంస్కృతి" అనే అంశమును మనం కొంత తెలుసుకుందాము. సృష్టి ప్రారంభమయిన నాటినుండి నేటి వరకు మానవుడు ప్రకృతిని విశ్లేషించడానికి ప్రయత్నిస్తునే వున్నాడు. పరిశోధన చేస్తున్నాడు. ప్రయోగా లను కొనసాగిస్తునే వున్నాడు. వీటి ప్రధాన వుద్దేశ్యము మానవునికి సుఖము, సంతోషమునందించటమే. ఒక వస్తువును కనుగొన్న తర్వాత దాని ప్రయోజనాన్ని కాంక్షిస్తూ వున్నాడు. ఆవిరి శక్తిని కనుగొన్నాడు. రైలు యింజను ద్వారా ప్రయాణసౌకర్యాన్ని పొందుతున్నాడు. విద్యుచ్ఛక్తిని తెలుసుకున్నాడు. బల్బును కనిపెట్టినాడు. ఇంటికి వెలుగును తెచ్చుకున్నాడు అంటే విజ్ఞాన శాస్త్రం ప్రధాన లక్ష్యం మానవ సౌఖ్యము, సంతోషము. అయితే సౌఖ్యాన్ని పొందుతున్నాడు. కానీ సంతోషాన్ని పొందలేకపోతున్నాడు. విలియమ్ బ్లేక్ అన్నట్లుగా "In Every face I meet a mark of Sorrow a mark of Weakness" అనగా ఏ ముఖము చూసినా ఏదో ఒక విచారము, ఏదో ఒక బలహీనత. సౌఖ్యము అనగా Comfort . సంతోషము అనగా Happiness విజ్ఞాన శాస్త్రము సుఖాన్నియిస్తున్నది. నిజమే, కానీ సంతోషాన్ని యివ్వలేకపోతున్నది. స్వామి వారంటారు. A.C రూమ్‌లో అంతా చల్లగానే వుంటుంది. నీరు చల్లగావుంటుంది. గాలి చల్లగావుంటుంది. కానీ Mind మాత్రము వేడిగా వుంటుంది. శాంతిలేదు. శాంతిని ఏ విజ్ఞాన శాస్త్రము ఉత్పత్తి చేయలేకపోతున్నది. ఏ Shop అయినా ఇక్కడ 'శాంతి' అమ్మబడును బోర్డు వ్రాసుకొని వున్నదా? Saries అమ్మే షాపులున్నాయి కానీ శాంతిని అమ్మేషాపులు ఎక్కడా లేవు కదా. కనుక మానవుడు ముఖ్యంగా ఆధునిక మానవునికి ఆవేదన, భయం ఎక్కువ అవుతున్నాయి. "భయం భయం బ్రతుకు, భయం భయం బ్రతుకు, భయం భయం" అంతా భయమే.

భర్తృహరి సుభాషితాలలో "భోగే రోగ భయం, కులేచ్యుతి భయం, విత్తేన్నృపాలార్భయం, మానే దైన్య

## ఆదూరి శ్రీనివాసరావు

భయం, బలేరిపు భయం, రూపేజరాయాభయమ్, శాస్త్రేవాద భయం, గుణేఖిలభయం, కాయేకృతాన్తార్భయమ్, సర్వం వస్తుభయాన్వితం భువి నృణం వైరాగ్యమేవా భయమ్. అంటే సంపూర్ణ భోగములు అనుభవిస్తున్నప్పుడు రోగమెక్కడ వచ్చునో అనుభయము, సత్కులమందు జన్మించినపుడు అప్రతిష్ఠ వచ్చునేమో అనే భయము, ధనవంతులకు ప్రభుత్వ భయము, అభిమానవంతులకు 'దేహి' అని అనవలసి వస్తుదేమో నని భయము, బలవంతులకు శత్రుభయము, యవ్వనవంతులకు ముసలి, భయము, శాస్త్రవేత్తకు ప్రతిదీ భయము, సద్గుణవంతులకు దుర్మార్గుల భయము, శరీరమును చూచినపుడు మరణ భయము కనుక ప్రపంచమంతా భయాన్వితమే కానీ ఒక్క వైరాగ్యమే 'అభయము' నిస్తుంది.

ఉదా: అమెరికా ప్రెసిడెంటు Bill Clinton గార్కి 2000 మంది సెక్యూరిటీ ఎందుకు? ఐశ్వర్యముంది, అధికారం వున్నది, విజ్ఞానమున్నది. అన్నీవున్నాయి కానీ భయం వున్నది. మరి మదర్ థెరిస్సాకు సెక్యూరిటీలేదేమి? కావున యీ విజ్ఞాన శాస్త్రము ఎంత పెరిగినప్పటికీ భయం అనేదానిని మనస్సునుండి పోగొట్టలేక పోతున్నది. మానవుని దుఃఖ విముక్తి చేయలేక పోతున్నది. అందుకనే One can get a House but not Home, One can have Food but not Appetite, One can have Money but not Love. దీనిని బట్టి విజ్ఞాన శాస్త్రం మానవుని మానవునిగా వుంచ లేకపోతున్నది. నాగసాకి, హిరోషిమాలో ప్రయోగించిన

అణుబాంబు కొన్ని లక్షలమంది ప్రాణాలు బలిగొన్నది. అనేక వేలమంది వికలాంగులైనారు. ఎంత అపకారం చేసిందో అందరికీ తెలుసు. అయితే Science చెడ్డదా స్వామీ? అని అడిగితే స్వామి అన్నారు 'Science is good but Scientists are "Bad"

ఇక్కడ సంస్కారము అవసరమవుతుంది. సంస్కార మంటే ఏమిటి? సంస్కరింపబడిన మానవజీవితాన్ని సంస్కారం అని చెప్పవచ్చు. అనగా చెడును తీసి మంచిని చేర్చటమే సంస్కారం అనిపించుకొంటుంది. సాటి వ్యక్తిని తనలాగా చూచుకొనటమే సంస్కారమనిపించుకొంటుంది. అదే మన సంస్కృతి.

"ఒరులేయని యొనరించిన
నరవర అప్రియము తన మనంబునకగుదా
నరులకు అవిసేయకునికి
పరాయణము పరమ ధర్మపథములకెల్లన్" అని

మహాభారతం తెల్పుతున్నది. Help ever, Hurt never అన్నదే సంస్కారము. Love all Serve all అన్నదే సంస్కారము. సర్వులలోను సర్వేశ్వరుడు వున్నాడనే భావనే సంస్కారము. దీనినే వేదాంత పరిభాషలో ఆత్మజ్ఞానము అని అంటారు. మనం కొంచము నిశితంగా పరిశీలిస్తే పల్లెలలో వున్న సంస్కారము పట్టణాలలో కన్పించదు. ఎవరికైనా కష్టమొస్తే అందరు కలిసి సహాయం జేస్తారు. అదే పట్టణాలలో ప్రక్కవాడు చస్తున్నా పట్టించుకోరు. నిజానికి పట్టణాలలోనే ఎక్కువ చదువుకున్నవారు వున్నారు. మరి వున్నతమైన చదువు ఏమి చేయగల్గుతున్నది. The end of education is Culture అన్నారు. నేడు Culture నశించి పోతున్నది. Uncultured గా తయారవుతున్నారు. మతము పేరిట మారణహోమం జరుగుచున్నది. మానవ బాంబులను తయారు చేస్తున్నది యీ విజ్ఞాన శాస్త్రం. India లో ఇడ్లీ తింటే Texas లో త్రేపవచ్చు అంతగా ఎదిగిపోయినాము. కానీ Culture లో కించిత్తు కూడా Advance కాలేకపోతున్నాము. కాని రోజుకు 20,000 మంది పిల్లలు సరైన ఆహారం లేక మరణిస్తున్నారని యు.ఎన్. లెక్కలు చెపుతు న్నాయి. Switzerland లో 1997 లెక్కల ప్రకారం తలసరి ఆదాయం 43,060 డాలర్లు. India లో 380 డాలర్లు Bangladesh లో 380 డాలర్లు. మరి యింత ఆర్థిక అసమానతలున్న దేశాలు మానవతను పెంపొందిస్తున్నవా?

"ప్రక్కనున్నవాని డొక్కమాడుచునుండ
నిక్కి పొట్టనిండ మెక్కువాడు
నిశ్చయముగ కాడు నిజమైన మనుజుడు
వున్నమాట తెలుపుచున్నమాట"

ప్రపంచంలో సిగరెట్టు తాగేవారు తమ అలవాటును మానివేసినట్లయితే ప్రపంచంలో అందరికీ ఆహారాన్ని అందించగలము. షుమారు 150 దేశాలు పేదరికంలో మ్రగ్గిపోతున్నాయి. సంస్కారమనేది విజ్ఞాన శాస్త్రం అందజేయగల్గినట్లయితే దారిద్ర్యాన్ని ఏనాడో పారద్రోలి వుండే వారము. Bertrand Russel అంటున్నారు. "We have produced a huge body of scienctific knowledge which can be called external civilisation. What is needed today is internal civilisation Our heart should expand with our mind. Arnold Schumature అన్నట్లుగా "Technology with human face, Economic with human face," మనం కోరుకోవాలి.

ఇటీవల జరిగిన హైజాక్ సంఘటన మన సమాజ సంస్కారానికి దర్పణం పట్టుచున్నది. కొత్తగ వివాహ మయిన జంటలో భర్తను హతమార్చి రచనకట్రాల్‌ను హృదయక్షోభకు గురిచేసినపుడు ఏమిచేసింది యీ శాస్త్ర విజ్ఞానము. మగ పక్షిని కూల్చినపుడు, ఆడపక్షి అల్లాడి పోతున్నపుడు ఆ దృశ్యాన్ని భరించలేక కన్నీరు కార్చి వాల్మీకి రామాయణ మహాకావ్యాన్ని వ్రాసినాడు. ఈనాడు ఒక్కరయిన కన్నీరు కార్చగలిగారా? కావ్యాన్ని వ్రాయగల్గినారా? విజ్ఞాన శాస్త్రం Informative మాత్రమే కాకూడదు. Transformative కావాలి "Civilisation is what we make, Culture is what we are" అన్నాడు Mark Twain. కనుక విజ్ఞాన శాస్త్రం నాగరికతను పెంచటమే కాదు. సంస్కారాన్ని పెంచగలగాలి **సంస్కారం లేని విజ్ఞాన శాస్త్రం కన్నా విజ్ఞాన శాస్త్రం లేని సంస్కారమే మిన్న.** 100 అడుగుల లోతునుండి నీరు Science తేలికగా తేగలుగుతుంది. కానీ దాహమయిన వానికి ఆనీరు మనం అందించలేకపోతే ఎందుకూ యీ Science? విజ్ఞానంతో పాటు విజ్ఞత పెరగాలి. వివేకం పెరగాలి. విచక్షణ పెరగాలి. మానవ సోదరత్వం దైవపితృత్వం అనే భావన పెరగాలి. సమతావాదం, సంఘీభావం కలిగి వసుధైక కుటుంబకమ్ అనే భావన మానవులలో నాటుకోవాలి.

"I am a man and I am not an animal" అన్న స్వామి ప్రబోధం కార్యరూపం దాల్చిననాడు జగమే ఒక సుందరనందనవనమైపోతుంది. ■

(2వ కవర్ పేజీ తరువాయి)

నాయకుడుగా చలామణీ అవుతున్నాడు. అసలు భారతదేశంలో అవినీతి అంత తీవ్రమైన నేరంగా పరిగణించ బడటం లేదు అవినీతి కూడా నిత్య జీవన విధానంలో ఒక భాగమై పోయింది. అవినీతికి సంబంధించి ఎంత పెద్ద తప్పు చేసినా తప్పించుకోవచ్చుననే భావన మన దేశంలో నానాటికి పెరిగిపోతున్నది. చైనాలోలాగే మరణశిక్షలు విధించకపోయినా తప్పుకు తగిన శిక్ష విధించే విధానమును మనం రూపొందించనంతవరకు ఈ పరిస్థితి ఈ విధంగా కొనసాగుతునే ఉంటుంది.

ఈ మధ్య మనదేశంలో పెద్ద విద్రోహ చర్య కూడా జరిగింది. భరత్‌పూర్‌లోని సైనిక ఆయుధాగారం అగ్నికి ఆహుతి అయింది. షుమారు 2000 కోట్ల రూపాయల విలువైన ఆయుధ సామగ్రి సర్వనాశనమై పోయింది. ప్రధానమంత్రి ప్రిన్సిపాల్ సెక్రటరీ బ్రిజేష్‌మిశ్రా - ఇది విద్రోహ చర్య కాదని కొట్టివేశారు. అయితే దీనిని విద్రోహచర్య కారణమై ఉంటుందన్న అనుమానాన్ని కొట్టివేయలేమన్నారు సైనికాధికారులు. ఏది ఏమైనప్పటికి మేజర్ జనరల్ సి బి. సుకు నేతృత్వంలో విచారణ మొదలైంది. ఇటువంటి దుస్సంఘటనలు మరెన్నో జరిగాయి.

ఈనాడు నీతి, నియమాలు (Morals & Principles) లేకుండా పోయినాయి. నైతిక విలువలకు ప్రాధాన్యత యివ్వటం లేదు. రాను రాను దేశభక్తి భావం లుప్తమైపోతున్నది. ధనమే శాశ్వతమని, సర్వస్వమని భావిస్తున్నారు. గుణానికి ప్రాధాన్యత యివ్వటం లేదు. **"దేశం ఎటుపోతే ఏమి! నేను బాగుపడితే చాలు!"** అనే స్వార్థం ప్రబలుతున్నది. ఈ భావం అత్యంత ప్రమాదం. ఇటువంటి దుర్భావాలు ప్రబలడానికి కారణం ఏమిటి?

స్వాతంత్ర్యం వచ్చి అర్ధ శతాబ్దం దాటినా బాలబాలికల నైతిక స్థాయి పెంచే ప్రయత్నం జరుగలేదు. విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకుని వస్తున్నామంటున్నారుగాని విద్యార్థులలో నైతిక స్థాయిని పెంచే ప్రయత్నం మాత్రం ఇంతవరకూ జరుగలేదు. విద్యాలయాలలో నీతి తరగతులు (Moral Classes) సక్రమంగా నిర్వహించబడటం లేదు. మార్కులు మీద తీసుకుంటున్నంత శ్రద్ధ వ్యక్తిత్వ నిర్మాణం మీద తీసుకోవటం లేదు. కేవలం మార్కులు మాత్రమే ప్రధానం కాదు. రిమార్కులు రాకుండా కూడా జాగ్రత్తపడాలి. ఈ దృష్టిలో విద్యా సంస్కరణలు తీసుకొని రావాలి. ప్రభుత్వ ఆలోచనాసరళి మారాలి తల్లిదండ్రుల మనస్తత్వం మారాలి. అధ్యాపకుల ప్రవర్తన కూడా మారాలి. అప్పుడే నేటి బాలబాలికలు ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దబడుతారు. అప్పుడే భవిష్యత్తు భారతావని యొక్క చరిత్ర కడు ఉజ్జ్వలంగా, శోభాయమానంగా రూపొందించబడుతుంది.

"జాతి గౌరవంబు నీతిపై నిలుచును నీతి లేకయున్న జాతి చెడును
నీతి గల్గు జాతియే నిజమైన జాతిరా వినుము భారతీయ వీరసుతుడా!"

అన్నారు భగవాన్ శ్రీసత్యసాయిబాబావారు. వారి ఆలోచనా సరళిని అనుసరిద్దాం, ఆచరిద్దాం, భారతావనిని తీర్చి దిద్దే మహాప్రయత్నంలో భాగస్వాములమై మన కర్తవ్యాన్ని నిర్వర్తిద్దాం, తరిద్దాం.

కొమరగిరి కృష్ణమోహనరావు
ఎడిటర్ 'శ్రీవాణి'

## శ్రీవాణి జీవిత సభ్యులు



Sri A PRASAD REDDY
L.I C. Development Officer
HINDUPUR - 515 201 Anat Dist



Smt. & Sri T. NAGA RAJU
HINDUPUR - 515 202. Anat. Dist.



Sri S. INDIRAMMA
SRIRANGAPURAM - 509 120.
Mahaboobnagar Dist.

Postal Registered
No H/M.P.M./34, Dt 10-12-1984

SREEVANI

Regd with Registrar of News
Papers Regd No. 45039/85



EDITED, PRINTED AND PUBLISHED BY **SRI KOMARAGIRI KRISHNA MOHAN RAO**
*Printed at Sreevani Offset Printers, Machilipatnam - 521 001. Ph: 21137*